# ప్రియదర్శికా నాటిక.



వేదము వేంకటరాయశాస్త్రి రచిత

సంస్కృతటిప్పణ సంపూర్ణాంధ్రటీకా

సమేతము.



జ్యోతిష్మతీముద్రాక్షరశాల.

(మల్లికేశ్వరవీథి.)

మదరాసు.



1909.

# విజ్ఞప్తి.

---

శృంగారరసగుళికయనం దగునీప్రియదర్శికానాటిక సూక్ష్మములో మోక్షమన్నట్లు చిఱుతుకతనముతోనే రసవత్తరం బయ్యును చిరకాలము మంచిముద్రణములు లేమిచే ప్రాయికముగా అనాస్వాదితమై యుండినది. ఇది తొలుత కలకత్తాలో దోషభూయిష్ఠముగాను విచ్ఛాయముగాను ముద్రిత మయినది. అనంతరము మంచిదశ కలిగి విశాఖపట్టణములో శ్రీమాన్ పరవస్తు శ్రీనివాస జగన్నాథస్వామిగారిచే సచ్ఛాయంబుగను సవ్యాఖ్యంబుగను (తెలుఁగులిపిలో), ప్రకటింపంబడి పఠనానుకూలం బయినది. అనంతర నాగరముద్రణములలో మేలైనవి పై తెనుఁగులిపిముద్రణంబునే అనుసరించినవి.

ఈరసమయప్రబంధమును ఆంధ్రసంస్కృతవిద్యార్థిలోకమునకు అరఁటిపండువలె ఒలిచి నోటఁబెట్టుటకై సంస్కృతటిప్పణముతోను తెనుఁగున సంపూర్ణటీకతోను ఈముద్రణముం గావించినాఁడను. ఈముద్రణమందు ఉచితము లనుతలంపుచే నటనట నాచేసినయించించుకసవరణలకు పెద్దలు మన్నింతురుగాక. విద్యార్థులు పెక్కండ్రు ముందుగా ఛాయనే వెదకుదురుగావున ఈముద్రణమందు మూలములో ఛాయను టీకలో ప్రాకృతమును నెక్కొలిపినాఁడను.

మఱి యిందలిసంవిధానసౌభాగ్యము ఏతన్మూలము లయినబృహత్కథాకథాభాగముల నెఱుంగనివారికి సుగ్రహము గాదు గావున, వానిని ఇందుం బొందుపఱిచినాఁడను.

పెద్ద లెల్లరును తమశిశువుల[illegible]కైనయీమదీయశ్రమను సఫలతం బొందింతురు గాక.



ఏప్రిల్, 1909. వేదము వేంకటరాయశాస్త్రి.

## కవిప్రశంస.

ఈనాటికను, రత్నావళీనాగానందములను, ధావకుఁడు ([illegible]) అనుకవి రచించి తన కాశ్రయ మైనశ్రీహర్షమహారాజు రచించినట్లు ప్రకటించినాఁ డని ఆభాణకము కలదు.

ఈధావకుఁడు ఇరువదింటికి కెక్కుడు నాటకములు రచించినట్లును అందు [illegible] రసప్రధాన మైనది కిరణావళి యను పేరిటిది ఒకటి యుండె ననియు [illegible] గ్రంథమువలనం దెలియ నగుచున్నది.

ఈధావకుఁడు చాకలి యనియు, ఘటకర్పరశబ్దఘటితశ్లోకాంత [illegible] చిన్ని కావ్యమును రచించినకతంబున నితనికి ఘటకర్పరుఁ డని నామాంతరము గలి గె ననియు,

"ధన్వన్తరి క్షపణ కామరసింహ శఙ్కు-
బేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య."

అని పరిగణితు లయినవిక్రమార్కునవరత్నములలో నొకఁ డనియును చెప్పుదురు.

మఱియు పూర్వోక్తశ్రీహర్షుఁడు క్రీస్తుశకమునకు ముందు (56-వ సంవత్సరము నుండి) శకప్రవర్తకుఁ డయినయుజ్జయినీపతి శ్రీ విక్రమాదిత్యుఁడే యనియు అందుచేత శ్రీహర్షుఁ డని నామాంతర మనియు కొందఱును, క్రీ. శ. ఏడవశతాబ్దమున కన్యాకుబ్జము నేలిన హర్షవర్ధనుఁ డని యొకకొందఱును, వీ రిరువురుం గా రనియు తా [illegible] డైన శ్రీహర్షుఁ డని మఱికొందఱును అభిప్రాయపడియున్నారు.

---

## వత్సరాజు పూర్వచరిత్రము (క. స. సా.)

తొల్లి ఉదయనుఁ డనురాజు పాండవవంశ్యుఁడు వత్సదేశమును కౌశాంబీనగరము రాజధానిగా నేలుచుండెను. ఆతఁడు బాల్యమునందు వాసుకియన్నను వసు నేమి యనునాగుని ఒకపాములవానిచేతి నుండి విడిపింపఁగా నాగుఁ డాకృతజ్ఞతచేత నతనికి ఘోషవతి యనునొకయద్భుతవీణ నిచ్చెను. దాని వాదనముచేతను తనపాటచేతను వత్సరాజు అడవిలో గొప్పగొప్పయేనుఁగులను ఎలయించి కట్టి తెచ్చుచుండెను.

ఉజ్జయినీపతి మహాసేనుఁడు చండికను గూర్చి తా నొనర్చినచండోపాసనచే ఆమెవలన చండమహాసేననామమును పొందినవాఁడు అంగారకాసురునిసుతను అంగారవతిని పరిణయమై ఆమెవలన గోపాలకుఁడు పాలకుఁడు నని యిరువురు పుత్త్రిలను వాసవునివరమువలన అసమాన లావణ్యను వాసవదత్త యనుకూఁతునుం బడసెను. ఆమెకు

వెండ్లియాడు రాఁగా చండమహాసేనుఁడు ఆమెకు తగినవరుఁడు తనకు శాశ్వతవైరి య
యినవత్సరాజు దక్క వే ఱొకఁడు లేమి నెఱింగి మెలపున నతని వశపఱుచుకొనువాఁ
డై వత్సరాజును తనయింటికి వచ్చి తనకూఁతునకు గాంధర్వవిద్య నేర్పవలయు నని దూ
తముఖముగా నడిగెను. మంత్రులబోధనచేత వత్సరాజు తనకడకే శిష్యనుగా కూఁతును
పంపవచ్చు నని చండమహాసేనునికి ప్రతిసందేశము పంపెను.

అంతట చండమహాసేనుఁడు వత్సేశునిగజగ్రహణవ్యసన మెఱిఁగి యతనిం బట్టు
కొన సాటిలేనిజంత్రపుటేనుఁగును చేయించి దానికడుపులో వీరపురుషులను దాఁచి
యుంచి వింధ్యారణ్యములో నిలిపించెను. వేఁటగాండ్రవలన ఆయేనుగునుగూర్చి విని వ
త్సరాజు దానిం బట్టువాఁడై తగలి అది బెదరు నని దండును దూరమున నిలిపి ఒంటిగా
దరిసి దాని నెలయింప ఘోషవతిని వాయించుచు సంగీతముచేసెను. అదియు వాస్తవ
గజమువోలె చేష్టించుచు గీతాఽకృష్టమువోలె దరియుచు, యదృచ్ఛచేతనుంబోలె నెడ
యుచు, అతని నేకాకిని గహనమున కెలయించెను. అంతట దానికడుపునుండి తలుపులు
తెఱచుకొని వీరపురుషులు దుమికి అతనిం బట్టి యుజ్జయినికిం గొనిపోయిరి. చండమహా
సేనుఁడు ఎదురువచ్చి సత్కరించి సంకెలల వైచియు 'ఓప్రభూ, ఈమెకు సంగీతము
నేర్పుము, పిమ్మట నీకు కల్యాణ మగును, చిత్తమందు ఆయాసపడకుము,' అని చెప్పి వా
సవదత్తను శిష్యఁగా నప్పగించెను. ఈప్రసక్తిచే వాసవదత్త వత్సేశుని వలచి యతనికై
యేసాహసమేనియుం జేయ సిద్ధపడి యుండెను.

ఇంతలో వత్సేశునిమహామంత్రి యౌగంధరాయణుఁడు రాజ్యము రుమణ్వదాదుల
కప్పగించి వచ్చి తనయోగవిద్యా ప్రభావముచేత తనకును వసంతకునికిని మాఱురూపులు
గావించికొని ఉజ్జయినిఁ జొచ్చి ప్రభువునకు వినోదార్థమై వసంతకుని తత్సన్నిధికిం
బంపెను. అనంతరము తాను వలసినయేర్పాట్లు గావించి అదృశ్యకరణిచే రాచనగరు
సొచ్చి వత్సరాజుం గాంచి యాతని నిట్లు హెచ్చరించెను:- "రాజా, నిన్ను చండమహా
సేనుఁడు మాయచేత పట్టి తెచ్చినాఁడు; నిన్నితఁడు కొమారితె నిచ్చి సమ్మానించి విడి
పింపఁ దలఁచి యున్నాఁడు; కనుక ఇతనికొమారితెను మనము స్వయముగా హరించి
కొనిపోవుదము. ఇందువలన నితనిగర్వమునకు తగినప్రాయశ్చిత్త మగును. మనకు పౌరు
షము లేదనులాఘవము కలుగకుండును. ఇతఁడు కొమారితెకు భద్రవతి యను నొక
యేనుఁగును ఇచ్చియున్నాఁడు. దానివేగమును పట్టుసామర్థ్యము నడగిరికి తప్ప మఱి
యేయేనుఁగునకును లేదు. దానిని చూచినయెడల నడగిరి దానితో యుద్ధము చేయనేచే
యదు. దానిమావటీని ఆషాఢకుఁ డనువానిని నేను విస్తారముధన మిచ్చి స్వాధీనపఱుచు
కొని యున్నాను. కావున వాసవదత్తాసమేతుఁడవై సాయుధుఁడవై ఆయేనుఁగు నెక్కి
రాత్రి రహస్యముగా వెడలిపోవలసినది." ఇట్లు చెప్పి యౌగంధరాయణుఁడు వెడ్లి
పోయెను.

అనంతరము వత్సరాజు ఆపన్నాగమును వాసవదత్త కెఱుకపఱిచెను. ఆమె యాషాఢకునిం బ్రయాణసన్నాహమున కాజ్ఞచేసెను. రాత్రి ఆషాఢకుఁడు భద్రవతిని సన్నాహముచేసి తెచ్చెను. వత్సరాజు యౌగంధరాయణోపదిష్టయోగములచే సంకిళ్లూడ్చుకొని ఘోషవతిం గైకొని, తానును వసంతకుఁడును వాసవదత్తయు ఆమెనెచ్చెలి కాంచనమాలయు ఆషాఢకుఁ డైదవవాఁడుగా అమత్తహస్తిని నెక్కినవాఁడై అది యప్పుడు ప్రాకారమును పగులఁగొట్టి చేసినదారిగుండ వెలువడి పహరావీరులను సంహరించి వేగముగా పయనము సాగించెను.

అంతట పట్టణమెల్ల గందరగోళపడఁగా వృత్తాంత మెఱిఁగి పాలకుఁడు నడగిరి నెక్కి వీరిని వెంటఁ దఱిమెను. వత్సరాజు వానిపై అంపవాన గురియించెను. భద్రవతిని నడగిరి కొట్టి డాయెను. ఇంతలో గోపాలకుఁడువచ్చి తమ్ముని యుద్ధమునుండి నివారించి తోడ్కొనిపోయెను. అనంతరము వత్సరాజు నిరాతంకముగా పయనము సాగించి వింధ్యారణ్యములో తనమిత్రుఁడు పుళిందకుని పల్లియలో విశ్రమించి క్రమక్రమముగా కౌశాంబిం జేరి అచటివారికెల్ల నేత్రోత్సవము గావించెను. అనంతరము గోపాలకాదులు వచ్చి వత్సరాజునకు వాసవదత్త నిచ్చి యథావిధిగా వివాహమహోత్సవము జరిపిరి.

ఈనాటికలోనికథ బృహత్కథయందలి (కథాసరిత్సాగరమునందలి) బంధుమతీ చరిత్రముపోలికను కల్పింపఁబడినది. ఆచరిత్ర యెట్లన:—

## బంధుమతి కథ.

ఒకప్పుడు గోపాలకుఁడు తాను బాహుపరాక్రమముచే పట్టితెచ్చిన బంధుమతి యనునొకరాజకన్యను వాసవదత్తకు కానుక పంపెను. ఆమెను వాసవదత్త మంజులిక యని మాఱుపేరు పెట్టి దాఁచి యుంచెను. రాజు ఒకనాఁడు బంధుమతిని చూచి వసంతకునిసాహాయ్యముచేత ఏకాంతముగా ఉద్యానవనములో నొకపొదరింట లావణ్యాసముద్రములోనుండి యుద్భవించిన యపరశ్రీనిం బోలె గాంధర్వవిధిచేత వివాహమాడెను. దానిని చాటునుండి చూచి కోపగించి వాసవదత్త తనపుట్టినింటినుండి వచ్చియున్న యొకపరివ్రాజికను సాంకృత్యాయని యనునామెను శరణుఁ జొచ్చెను. ఆమెమాటలచేత అలుకతీఱి వాసవదత్త బంధుమతిని భర్తకిచ్చివేసెను.; పతివ్రతల మనస్సు మృదువుగదా; ఇచ్చి వసంతకుని గూడ ఖయిదు నుండి వదలివేసెను.—

ఈ బంధుమతీ గోపాలక మంజులికా లతాగృహములకు బదులు నాటికలో ప్రియదర్శికా విజయసేనారణ్యకా దీర్ఘికలు. కడమవిషయమెల్ల రెంటనుం గలదు.

---

# నాటకపాత్రములు.

## పురుషులు.

| | | |
|---|---|---|
| సూత్రధారుఁడు. | | |
| వినయవసువు. | ... | ... అంగరాజు కంచుకి |
| ఉదయనుఁడు. | ... | ... వత్సరాజు, కథానాయకుఁడు. |
| వసంతకుఁడు. | ... | ... విదూషకుఁడు. |
| రుమణ్వంతుఁడు. | ... | ... ఉదయనునియమాత్యుఁడు. |
| విజయసేనుఁడు. | ... | ... ,, సేనానాయకుఁడు. |
| చండమహాసేనునికంచుకి. | | |

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| ప్రతీహారి. | | |
| వాసవదత్త. | ... | ... ఉదయనుని పట్టపుదేవి. |
| ఆరణ్యిక (=ప్రియదర్శిక). | | ... అంగరాజు కూఁతురు, కథానాయిక. |
| ఇందీవరిక. | ... | ... చేటి. |
| మనోరమ. | ... | ... ,, |
| కాంచనమాల. | ... | ... ,, |
| సాంకృత్యాయని. | ... | ... పరివ్రాజిక. |

# ఛందోవిషయము.

---

౧. శార్దూల విక్రీడితము (మసజసతతగ, 12, 7.)

సూర్యాశ్వై ర్మసజస్తతా స్సగురవః శార్దూలవిక్రీడితమ్.

| | | | | |
|---|---|---|---|---|
| ధూమవ్యా | లీలామ | అచ్ఛిన్నా | రూపంత | స్పృష్టఃకిం |
| శ్రీహర్షో | క్షమాంమ | హ్యాత్వాప | వృత్తిర్వశ్లి | భ్రూభఙ్గం |
| భృత్యానా | బిభ్రాణా | పాదైర్న్యా | స్నిగ్ధంయ | ఏషావీ |
| దృష్టం ఛా | పాతాళా | సంతాపం | స్వేదామ్భః | నిశ్శేషం |

౨. స్రగ్ధర. (మరభనయయయ, 7, 7, 7.)

మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్.

కైలాసా పాదాతం అభాత్య వృన్తైఃతు శ్రోత్రంహం సద్యోవ నిర్దిష్టా ఊర్వీము.

ఇంద్రవజ్ర (తతజగగ); ఉపేంద్రవజ్ర (జతజగగ.)

స్యాదిన్ద్రవజ్రా తతజా స్తతో గౌ, ఉపేన్ద్రవజ్రా జతజా స్తతో గౌ.

3. కొన్ని పాదములు ఇదియు, కొన్ని పాదములు అదియు, నైన ఉపజాతి.

రాజ్ఞోవి. అస్త్వఃపు.

౪. ఆర్య (వరుసగా, నాల్గుపాదములలో 12, 18, 12, 15 మాత్రలు.)

| | | | | |
|---|---|---|---|---|
| ఘనబ | ఆబద్ధ | ప్రాయోయ | అహీన | సుఖినీ |
| తత్క్షణ | సాసణీ | సపరి | ఏతేన | హాత్వాక |

౫. వసంతతిలక (తభజజగగ, 8, 6.)

ఉక్తా వసన్తతిలకా తభజాజగౌగః.

ఏవంబ ఆభాతి కింముక్త అస్మద్భ సంగాత

౬. ఉపగీతి (ఆర్యయే, ద్వితీయపాదము 15 మాత్రలు.) ఉద్యాన

౭. మాలిని (ననమయయ 8, 7.)

ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః. అయివి

౮. గీతి (ఆర్యయే, చతుర్థపాదము 18 మాత్రలు.) ఘనాబం

౯. శిఖరిణి (యమనసభలగ, 6, 11.

రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ. స్వభావ

శ్రీ

# ప్రి య ద ర్శి కా.

నా న్ది.

ధూమవ్యాకులదృష్టి [1] రిన్దుకిరణై
    రాహ్లాదితాక్షీ, పునః
పశ్యన్తీ వర ముత్సుకా, నతముఖీ
    భూయో హ్రియా [2] బ్రహ్మణః,
స్వేర్ష్యా పాద నఖేన్దు దర్పణ గతే
    గఙ్గాం దధానే శివే,
స్పర్శా దుత్పులకా, కరగ్రహవిధౌ,
    గౌరీ శివా యాస్తు వః.

పాణిగ్రహణ విధియందు పొగచేత కలఁతపడిన చూపుగలదై చంద్రకిరణముల చేత సుఖపెట్టఁబడిన కన్నులు గలదియు, మఱల పెండ్లికుమారుని తమకముతో చూచుచున్నదై బ్రహ్మవలన ఎక్కుడుసిగ్గుచేత మోము వాంచినదియు, చంద్రునివలె గుండ్రమును ప్రకాశమానమును అద్దమువలె స్వచ్ఛమును అయిన కాలిగోటియందు ప్రతిఫలించినవాఁడైన గంగాధరుఁడైన శివుని మీఁద ఈసు గలదియు, (ఆయనచేతి) తాఁకుడుచేత గగుర్కొన్నదియు, నయిన గౌరి మీకు మంగళముకై యగును గాక.

సామాజికులకు మేలుసేయవలయు నని గౌరిని వేఁడుట.—కరగ్రహవిధౌ—కర = చేతియొక్క (చేతిని) - గ్రహ = పట్టుకొనుటయొక్క - విధౌ = పనియందు (పెండ్లియందు అనుట; పెండ్లిలో పెండ్లికొమారితచేతిని పెండ్లికొమారునిచేత పట్టింతురు గావున, పాణిగ్రహణము ,కరగ్రహము ఇత్యాదిశబ్దములు పెండ్లికి పేర్లయినవి), ధూ...ష్టిః—ధూమ = (వివాహాగ్నియొక్క) పొగచేత - వ్యాకుల = కలఁతనొందిన - దృష్టిః = చూపుగలది (యు), ఇన్దుకిరణైః—ఇన్దు = (శివునిశిరస్సునందలి) చంద్రునియొక్క - కిరణైః = వెలుఁగులచేత, ఆ...క్షీ—ఆహ్లాదిత = ఆనందపెట్టఁబడిన - అక్షీ = కన్నులుగలది (యు), పునః = మఱల, ఉత్సుకా = తమకముగలదై, వరమ్ = పెండ్లికుమారుని (శివుని), పశ్యన్తీ = చూచుచున్నది (యు), బ్రహ్మణః = (చెంతనున్న) బ్రహ్మదేవునివలన, భూయోహ్రియా—భూయః = అధికమయిన - హ్రియా = సిగ్గుచేత, (పొగవలన మొదట దర్శనభంగమయినట్లు ఇప్పుడు బ్రహ్మవలన నయిన దని భావముగా, భూయః = మఱల, అని యేని యర్థము చెప్పవచ్చును.), నతముఖీ—నత =

వంగిన - ముఖీ = మొగము గలది (యు), గఙ్గామ్ = గంగాదేవిని, దధానే =(నెత్తి యందు) ధరించియున్నవాఁడై, పా... తే—పాద = (తనయొక్క అనఁగా పార్వతి యొక్క) కాలియొక్క - ఇన్దు = చంద్రునివంటి - నఖ = గోరనెడు - దర్పణ = అద్దమును (చంద్రునివలె గుండ్రముగాను తెల్లగాను, అద్దమువలె స్వచ్ఛముగాను, ఉన్న ట్టిగోటిని) - గతే = పొందినట్టి (గోటియద్దమందు ప్రతిఫలించిన), శివే = శివునివిష యమై, సేర్ష్యా = ఈసుతోఁ గూడుకొన్నది (యు), స్పర్శాత్ = (శివునిచేతి) తాఁ కడుచేత, ఉత్పులకా—ఉత్ = ఉద్భిన్న = మొలచిన - పులకా = గగుర్పాటు కలది (యు), (నయిన), గౌరీ = పార్వతి, వః = (ఓసామాజికులారా) మీకు, శివా య = మంగళముకొఱకు, అస్తు = అగునుగాక (మేలు సేయును గాక).

1. ఇన్దుకిరణై రాహ్లాదితాక్షీ—ఇట్లే -
"గిరిశ ముపచచార ప్రత్యహం సా సుకేశీ
ప్రశమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః." కుమార.
2. నతముఖీ హ్రియా బ్రహ్మణః—ఆసన్నిధియందు బ్రహ్మ యుండినందులకు.—
"ఇత్థం విధిజ్ఞేన పురోహితేన ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ
ప్రణేమతుస్తౌ పితరౌ ప్రజానాం పద్మాసనస్థాయ పితామహాయ." కుమార.

తా.—పార్వతీపరమేశ్వరుల వివాహసమయమందు వివాహాగ్నియొద్ద పార్వతి పరమేశ్వరుని చూచుటకై ఆతనివైపు కడగంటి చూడ్కులు నిగిడింపఁగా కన్నులకు పొగ కమ్ముకొని కన్నులు ఎరియఁజొచ్చినవి; కాని, వెంటనే పెండ్లికుమారుని తలమీఁద నున్న జాబిల్లియొక్క వెలుఁగులచేత చల్లఁబడి మిక్కిలిసుఖము నొందినవి. అంత నామె మఱల నాతనిం దనివితీఱఁ గాంచుచుండఁగా ఆకాంచుటను ఆచెంతనున్న బ్రహ్మదేవుఁడు పరికిం చుచుండెను; అతఁడు పరికించుటను ఆమెయుం గని సిగ్గుపడినదై వరుని చూచుట మాని తలవంచుకొన్నది. అంతట అద్దమువలె స్వచ్ఛ మయినతనకాలిగోటియందు ఆమెకు శివు నియొక్కయు అతనినెత్తిమీఁద నున్నగంగాదేవియొక్కయు నీడ యగపడెను. అంతట వే ఱొకతెను నెత్తి కెక్కించుకొని యున్నాఁడీతఁ డని యామెకు మనస్సులో ఆయ నమీఁద ఈసు పొడమఁగా, ఆసమయమందు ఆమెచేతిని శివుఁడు తనచేతం గయికొనెను; అంత నామె ఆయీసు మఱచి ప్రియతముని చేతి స్పర్శానందమున ఓలలాడుచుండెను. ఆయానందదశలోనున్న పార్వతి, ఓసామాజికులారా, మీకు మే లొసంగుఁగాక.

ఇది నాందీ శ్లోకము. నాంది యనునది నాటకాదులయారంభమందు దేవ బ్రాహ్మణ రాజ ప్రభృతులకు స్తుతిగా సామాజికాదులకు ఆశీర్వచనరూపముగా 8, 12, 18, 22, పదములు గలదిగా రచింపఁబడును. ఇందు బిల్వ శంఖ చంద్ర కమల చక్ర వాక కుముదాది శుభవస్తువాచకములును కావ్యార్థసూచనయు, నుండవలయును. శ్లోం

అపి చ;
'కైలాసాద్రా వుదస్తే
పరిచలతి, గణే
షూల్లసత్కౌతుకేషు,

మఱియును;
(రావణునిచేత) ఎత్తఁబడిన కైలాస పర్వతము తూలుచుండఁగా, ప్రమథులు ఉప్పొంగుచున్న కుతూహలముగలవారు అగుచుండఁగా, కుమారస్వామి తల్లియొ

దశమతంబున పదనియమ కథాంశసూచనలు పాక్షికములు.

'ఆశీర్వచనసంయుక్తా స్తుతి ర్యస్మాత్ ప్రయుజ్యతే
దేవద్విజనృపాదీనాం తస్మా న్నాన్దీతి సంజ్ఞితా,
మఙ్గల్య శ్శఙ్ఖ చ న్ద్రాబ్జ కోక కైరవ శంసినీ
పదై ర్యుక్తా ద్వాదశభి రష్టాభి ర్వా పదై రుత.' సా. ద.

'య త్రాష్టాభి ర్ద్వాదశభి రష్టాదశభి రేవ వా
ద్వావింశత్యా పదై ర్వాపి సా నాన్దీ పరికీర్తితా.'

'అర్థతః శబ్దతో వాపి మనా క్కావ్యార్థసూచనమ్.'

'పదాదినియమోఽపివా.'

'నన్దన్తి దేవతా యస్మాత్ తస్మా న్నాన్దీతి సంజ్ఞితా.'—అనఁగా, ఎందువలన దేవతలు(ఆ)నందింతురో అందువలన నాంది యని పేర్కొనఁబడినది, అని నాందీసంజ్ఞావివరణము.

కావ్యార్థసూచన వాదులు, ఈశ్లోకమునందు—గంగను నెత్తి కెక్కించుకొన్న శివుఁడు గౌరిని వివాహమయినట్లు చెప్పుటచేత, పట్టపుదేవికి (వాసవదత్తకు) మిక్కిలి యనురక్తుఁ డయినమహారా జొకఁడు (వత్సరాజు) వే ఱొకకన్నెను (ప్రియదర్శికను) పెండ్లియగుట, పొగకమ్ముట లోనగువానిచేత వరుసగా నాయికావదనమును తామర కొలనిలో తుమ్మెదలు కమ్ముట, వానిని తొలఁగించి రాజు తనదేహప్రభచేత ఆమెనేత్రములకు విందొనర్చుట, ఆమె యాతనిం దమితోఁ గాంచుట, అనంతరము తనవిరాలిని చెలితోనేనియు చెప్పుకొనుటకు లజ్జించుట, పట్టపుదేవివిషయమై యీసు దాల్చుటయు, కడపట నతనింగూడి యానంద మొందుటయు, నను కావ్యార్థాంశములు సూచితము లని చెప్పుదురు. పదనియమమతమున ఈశ్లోకమున 22 పదములను ఎన్నుకొనవచ్చును.

**1.** రావణుఁడు కైలాసము నెత్తినందునం గలిగినకార్యముల వర్ణనతోడి యీశ్వర ప్రార్థన.—ఉదస్తే = (రావణునిచేత) ఎత్తఁబడిన, కైలాసాద్రౌ—కైలాస = కైలాస మనెడు - అద్రౌ = పర్వతము, పరిచలతి (సతి) = అల్లలనాడుచు (ఉండఁగా), గణేషు = ప్రమథులు (అనఁగా శివకింకరులు), ఉల్ల...కేషు సత్సు—ఉల్లసత్ = ఉప్పొంగుచున్న - కౌతుకేషు సత్సు = (ఇది ఏమని తెలిసికొనుటకు) కోరికగలవారు

క్రోడం మాతుః కుమారే
విశతి, విషముచి
ప్రేక్షమాణే సరోషమ్,
పాదావష్టమ్భసీద
ద్వపుషి దశముఖే
యాతి పాతాళమూలం,
క్రుద్ధోఽ ప్యాశ్లిష్టమూర్తి
ర్భయఘన ముమయా
పాతు తుష్టః శివో వః.

క్క ఱొమ్మునం జొరఁగా, పాము కోపముతో పరికించుచుండఁగా, (శివుఁడు) కాలితో అదుముటచేత క్రుంగుచున్న దేహము కలవాఁడై రావణుఁడు పాతాళమునడుగునకు పోవుచుండఁగా, (రావణునిమీఁద) కోపగించినవాఁ డయ్యును పార్వతిచేత భయమువలన బిగువుగా కవుంగిలింపఁబడిన దేహముకలవాఁడై ఆనందించిన శివుఁడు మిమ్ము రక్షించుఁగాక.

(అగుచుండఁగా), కుమారే మాతుః క్రోడం విశతి (సతి) = కుమారస్వామి (శిశువుగాన భయముచే)తల్లి(పార్వతి)యొక్క ఱొమ్మును చొచ్చుచు (ఉండఁగా), విషముచి=(విష= విషమును - ముక్ = వదలునది) (శివునికి ఆభరణమైన) సర్పము (వాసుకి), సరోషమ్= కోపముతో, ప్రేక్షమాణే = (సతి) చూచుచు (ఉండఁగా), పా...షి—పాద= (శివుని) పాదముయొక్క - అవష్టమ్భ = ఒత్తుటచేత - సీదత్ = క్రుంగుచున్న - వపుషి = దేహముకలవాఁడైన, దశముఖే = పదితలలవాఁడు (రావణుఁడు), పాతాళ మూలం యాతి (సతి)=పాతాళముయొక్క అడుగుభాగమునకు పోవుచు (ఉండఁగా) (రావణుఁడు కైలాసమును పెకలించి తూలించినంతట శివుఁడు తనపాదముతో దాని నదిమె ననియు అంతట రావణునిచేతులు కొండక్రింద నిఱికికొనఁగా కొండతోఁ గూడ రావణుఁడు పాతాళమునకు క్రుంగిపోయె ననియు భా.), క్రుద్ధః అపి = (రావణుని దౌర్జన్యమునకు) కోపగించినవాఁడయ్యును, ఉమయా = పార్వతిచేత, భయ ఘనమ్ = భయముచేత చిక్కఁగా, ఆశ్లిష్ట మూర్తిః (సన్) = కవుంగిలింపఁబడిన దేహముగల వాఁడు (అయి), తుష్టః = ఆనందమొందిన, శివః = శివుఁడు, వః పాతు = మిమ్ము కాచును గాక.

కొందఱు ఈశ్లోకము కూడ నాందిలో చేరినదే యనియు, ఇందును పరమేశ్వరుఁడు రావణుని దండించి యుమాస్వయంగ్రాహము బొందినట్లు వర్ణించుటచేత, వత్సరాజు వింధ్యకేతుకళింగ రాజులం గూల్చి ప్రియదర్శికం బడయుట సూచిత మనియు, చెప్పుదురు. ఈరెండుశ్లోకములనాందిని పదనియమము సరిపడుటకై పద మనఁగా శ్లోకపాద మని యర్థము చెప్పి అష్టపదనాంది యందురు. అయినను ఇట్టిరూపకారంభశ్లోకములు రంగద్వారముగాని నాంది కావని విశ్వనాథకవిరాజుమతము.

---

# [1]ప్రస్తావనా.

నాన్ద్యన్తే [2] సూత్రధారః (ప్రవిశ్య)—అద్యాహం [3] వసన్తోత్సవే సబహుమానమాహూయ నానాదిగ్దేశాగతేన రాజ్ఞః శ్రీహర్షదేవస్య పాదపద్మోపజీవినా రాజసమూహేనోక్తః:—యథా - "అస్మత్స్వామినా శ్రీహర్షదేవేన అపూర్వవస్తురచనాలంకృతా ప్రియదర్శికా నామ [4] నాటికా కృతేతి అస్మాభిః

నాందికడపట సూత్రధారుఁడు (ప్రవేశించి)—నేఁడు నన్ను వసంతోత్సవములో సగౌరవముగా పిలిచి నానాదిగ్దేశములనుండి వచ్చినట్టిది ( - నట్టివారు) శ్రీహర్ష (మహా) రాజుయొక్క పాదపద్మములవలన జీవించునది (జీవించువారు) రాజులసమూహము (రాజులు కలసి) ఆనతిచ్చినది (ఆనతిచ్చినారు):—ఎట్లన - "మాయేలినవారు శ్రీహర్షమహారాజుగారు నూతనకథారచనతో నలంకరించి ప్రియదర్శిక యను

1. నటి యేని విదూషకుఁ డేని పారిపార్శ్వకుఁ డేనియు సూత్రధారునితో స్వకార్యములంగూర్చి చిత్రవాక్యములతో నారంభించి నాట్యవస్తువును ప్రశంసించునట్టి సంభాషణ ఆముఖ మనియు ప్రస్తావన యనియు పేర్కొనఁబడును.

'నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రై ర్వాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభి ర్మిథః
ఆముఖం తద్విజానీయా ద్బుధైః ప్రస్తావ నోచ్యతే.'

2. సూత్రం కథాసూత్రం ధారయతీతి సూత్రధారః; సూత్రమును అనఁగా కథాసూత్రమును ధరించువాఁడు సూత్రధారుఁడు, ప్రధాననటుఁడు. ఒకసూత్రధారుఁడు తెరచాటుననేని తెరబయట నేని నాందిని పఠించును; అనంతరము అతఁడే యేని, అతఁడు పోయి (స్థాపకుఁ డను పేరి) యింకొకసూత్రధారుఁడేని తెరబయట ప్రస్తావనను జరుపును.

3. గ్రంథమంతు వివాహకథమైనచో వసంతమునేని గ్రీష్మమునేని ప్రస్తావించుట సంప్రదాయము. 'శరత్ సంగ్రామవిషయే వివాహే గ్రీష్మమాధవా.'

4. నాటికయందు—కథ కల్పితము; స్త్రీపాత్రములు బహుళము; నాలుగంకములు; ప్రసిద్ధుఁడు ధీరలలితుఁడు రాజు నాయకుఁడు; నాయిక అంతఃపుర సంబంధురాలు, సంగీతవ్యాపారమం దుండునది యొండె, నూతనానురాగ, కన్య, మహీనాయకపుత్త్రి; ఈమెను గూడుటకు నాయకుఁడు పట్టపుదేవికి వెఱచియు జతనములు సేయును. దేవి జ్యేష్ఠురాలు, ప్రౌఢ, నరపతిపుత్త్రి, మాటిమాటికి మానము వహించునది. నాయికానాయకులసంగమము దేవీవశములో నుండును. ఇందు కైశికీవృత్తి, విమర్శేతరసంధులు.

శ్రోత్రపరమ్పరయా శ్రుతా, న ప్రయోగతో దృష్టా; తత్ త స్యై వ రాజ్ఞః సకలజనహృదయాహ్లాద కారిణో బహుమానా దస్మాసు చా నుగ్రహబుద్ధ్యాయథావత్ త్వయా నాటయితవ్యేతి. తద్యావ న్నై పథ్యరచనాం కృత్వా యథాభిల షితం సంపాదయామి. (ఇతి పరి తో విలోక్య) ఆవర్జితాని సామాజి కమనాం సీతి మే నిశ్చయః. కుతః?

3 శ్రీహర్షో నిపుణః కవిః, పరిషద
ప్యేషా గుణగ్రాహిణీ;
లోకే హారి చ వత్సరాజచరితం;
నాట్యే చ దక్షా వయమ్.

నేర నాటికను చేసియున్నా రని కర్ణపరం పరగా వింటిమి గాని ఆటలో చూడమైతి మి; కావున సకలజనులహృదయములకు ఆనందము సేయువారయిన యా రాజుగారి మీఁది గౌరవమువలనను మామీఁది యను గ్రహముచేతను (ఆనాటికను) చక్కఁగా నీవు ఆడింపవలసినది.'' అని. కావున వేష ధారణముచేసి కోరినట్లు నెఱవేర్చెదను. (అని అంతటం గాంచి) సభాసదులహృద యములు వశీకరింపఁబడిన వని నాకు నిశ్చ యము. ఏల యన?

శ్రీహర్షుఁడు నేర్పరి యైన కవి, ఈస భయు గుణమును గ్రహించునట్టిది, వత్స రాజుకథయో లోకమందు మనోహరమై నది, మేమును నాట్యమందు సమర్థులము.

'నాటికా క్లృప్తవృత్తా స్యాత్ స్త్రీప్రాయా చతురఙ్కికా;
ప్రఖ్యాతో ధీరలలిత స్తత్ర స్యా న్నాయకో నృపః;
స్యా దన్తఃపురసంబద్ధా సంగీతవ్యాపృతాఽథవా
నవానురాగా కన్యాఽత్ర నాయికా నృపవంశజా;
సంప్రవర్తేత నేతాఽస్యాం దేవ్యా స్త్రాసేన శఙ్కితః;
దేవీ పున ర్భవే జ్జ్యేష్ఠా ప్రగల్భా నృపవంశజా
పదే పదే మానవతీ; తద్వశః సంగమో ద్వయోః,
వృత్తిః స్యాత్ కైశికీ; స్వల్పవిమర్శాః సంధయః పునః.' సా. ద.

1. యావత్సంపాదయామి = సంపాదయిష్యామి 'యావత్పురానిపాతయోర్లట్'

2. సమాజః సమావేశనం ప్రయోజన మేషా మితి సామాజికాః.

3. పరితః సీద న్త్యస్యా। మితి పరిషత్. కావ్యార్థాపత్తి అలంకారము 'కైము త్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే.' సముచ్చయాలంకారంబును 'అ హం ప్రథమికాభాజా మేకకార్యాన్వయోఽపి సః.' ఈశ్లోకము ప్రరోచన య నెడిప్రస్తావనాంగము. కవికావ్యనటాదులప్రశంస ప్రరోచన యనఁబడును. రత్నా

వస్త్వేకైకమపీహ వాఞ్ఛితఫల
ప్రాప్తేః పదం; కిం పున,
ర్మద్భాగ్యోపచయాదయం సము
దితః సర్వో గుణానాం గణః.

([1]నేపథ్యాభిముఖ మవలోక్య) అయే! ప్రస్తావనాభ్యుద్యతే మయి విదితాస్మదభిప్రాయో [2] అఙ్గాధిపతే ర్దృఢవర్మణః [3] కఞ్చుకినో భూమికా మాదాయాస్మ[4]త్తాత ఇత ఏ వాభివర్తతే! తద్యావదహమ ప్యనన్తరభూమికాం సంపాదయామి. [ఇతి నిష్క్రాన్తః.

ఇతి ప్రస్తావనా.

ఈ(ప్రతిదియు) కోరినఫలము లభించుటకు కారణమైయున్నది; ఇంక నేమి! నాయదృష్టాతిశయమువలన నిదే సమస్తగుణముల సముదాయము కూడినది.

(తెరవంక చూచి) ఆహా! నేను ప్రస్తావనకై కడంగఁగానే నాతలంపు నెఱింగినవాఁడై, అంగదేశాధీశ్వరుఁడగు దృఢవర్మయొక్క కంచుకియొక్క వేషమును దాల్చి మాయన్న ఇటకే వచ్చుచున్నాఁడు! కావున నేనును తరువాతివేషమును సమకూర్చెదను. [అని నిష్క్రమించును.

ప్రస్తావన ముగిసినది.

---

వళీనాగానందములయందును ఇదే ప్రరోచనాశ్లోకము. నాగానందములో 'వత్సరాజ' అనుటకు బదులు 'సిద్ధరాజ' అని భేదము.

'నియోజనం ప్రయోజ్యస్య, నిర్దేశో దేశకాలయోః,
కావ్యార్థసూచకైః సూక్తైః సభాయా శ్చిత్తరఞ్జనమ్
కవికావ్యనటాదీనాం ప్రశంసా చ, ప్రరోచనా.'

1. నేపథ్య మనఁగా తెరమఱుఁగున నటకుటుంబము వేషములు దాల్చెడుచోటు.

2. అచ్చోట మహాదేవునిహుంకారముచేత కాముఁడు అంగమును వదలినందున దానికి అంగ (దేశ) మని పేరు కలిగినది.

3. 'అన్తఃపురచరో వృద్ధో విప్రో గుణగణాన్వితః
సర్వకార్యార్థకుశలః కఞ్చుకీత్యభిధీయతే.' (అభిధీయతే = అనఁబడును.)
'యే విద్యాసత్త్వసంపన్నాః కామదోషవివర్జితాః
జ్ఞానవిజ్ఞానకుశలాః కఞ్చుకీయా స్తు తే స్మృతాః.'

4. ఇట 'అస్మద్భ్రాతా' అనఁగా 'మాయన్న' అని పా. ఇవ్విధమున పాత్రము ప్రవేశించుట ప్రయోగాతిశయ మనఁబడును.

'యది ప్రయోగ ఏకస్మిన్ ప్రయోగోఽన్యః ప్రయుజ్యతే
తేన పాత్రప్రవేశ శ్చేత్ ప్రయోగాతిశయ స్తదా.'

## ¹శుద్ధ విష్కమ్భః.

(తతః ప్రవిశతి కఞ్చుకీ.)

కఞ్చు.—(సశోకం శ్రమం నాటయన్ నిశ్శ్వస్య) కష్టం భోః కష్టమ్!

²రాజ్ఞో విపద్బన్ధువియోగదుఃఖం
దేశచ్యుతి ర్దుర్గమమార్గఖేదః
ఆస్వాద్యతే ఽస్యాః కటు నిష్ఫలాయాః
ఫలం మయైత చ్చిరజీవితాయాః.

(సశోకవిస్మయమ్) తాదృశస్యాపి నామ అప్రతిహత³శక్తిత్ర

(అంతట కంచుకి ప్రవేశించును.)

కంచు.—(దుఃఖముతోడి యలసట నభినయించుచు నిశ్వసించి) కటకటా!

రాజుయొక్క ఆపద, బంధువులను బాసినదుఃఖము, స్వదేశమునుండి తొలఁగుట, నడవ శక్యము గాని దారుల శ్రమ;— ఇది ఫలహీన మయినయీదీర్ఘాయుస్సుయొక్క చేదుపండు నాచే రుచిచూడఁబడుచున్నది.

(దుఃఖాశ్చర్యములతో) అట్టివానికి ఔరౌర! ఎదురులేని శక్తిత్రయముగలవా

1. విష్కంభస్వరూపము.—అయినవియు కాఁబోవునవియు నగు కథాంశములను సంగ్రహముగా తెలుపునది విష్కంభము, అంకమునకు పూర్వము నిబంధింపఁబడును. మధ్యపాత్రముచేతఁగాని మధ్యపాత్రములచేతఁగాని ప్రయోగింపఁబడునది శుద్ధవిష్కంభము; నీచమధ్యపాత్రములచేత ప్రయోగింపఁబడునది మిశ్రవిష్కంభము.

'వృత్తవర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః,
సంక్షిప్తార్థ స్తు విష్కమ్భ ఆదా వఙ్కస్య దర్శితః;
మధ్యేన మధ్యమాభ్యాం వా పాత్రాభ్యాం సంప్రయోజితః
శుద్ధో; మిశ్ర స్తు విజ్ఞేయో నీచమధ్యప్రయోజితః.'

2. రాజ్ఞః—ఈరాజు అంగాధిపతి దృఢవర్మ. విపత్—ఈయనకుఁ గలిగినయాపద కళింగరాజు తనపట్టణమును ముట్టడింపఁగా అతనితో పోరి ఓడి గాయములుపడి అతనిచేత చెఱఁగొనఁబడుట మొ. దుర్గమమార్గము – వింధ్యారణ్యమందలి దారి. చిరజీవితాయాః – ఈశబ్దముయొక్క స్త్రీలింగస్వారస్యముచేతను ఫలోక్తిచేతను చిరజీవిత నిడివిగా పర్వుచుండులతవంటి దని స్ఫురించుచున్నది. నిష్ఫలాయాః ఫలమ్ – అనుటలో విరోధ మేమియు లేదు, ఎట్లన, ఇంతవఱకు నిష్ఫలము ఇప్పుడు కటుఫల మని భా. ఈముదిమివలన ఇంతవఱకు సుఖానుభవ మేమియు లేక పోయెను, ఇప్పుడు ఈదుఃఖపరంపర కలిగెను, అని భా. సముచ్చయాలంకారము.

3. శక్తిత్రయము=ప్రభుమంత్రోత్సాహశక్తులు.

యస్య [1] రఘు దిలీప నహుష తుల్యస్య దృఢవర్మణో మత్ప్రార్థనేఽప్యనేన స్వ [2] దుహితా వత్సరాజాయ దత్తేతి బద్ధానుశయేన వత్సరాజో దృఢబన్ధనే వర్తత ఇతి లబ్ధరన్ధ్రేణ [3] కళిఙ్గహతకేన విపత్తి రీదృశీ క్రియత ఇతి [4] యత్సత్య ముపపన్న మపి న శ్రద్దధే. కథ మేకాన్తనిష్ఠుర మీదృశం చ దైవ మస్మాసు! యేన సాఽపి రాజపుత్త్రీ 'యథాకథఞ్చి దేనాం వత్సరాజా యోపనీయ స్వామిన మనృణం కరిష్యామీ'తి మయా తాదృశాదపి ప్రళయకాలదారుణా దవస్కన్దసంభ్రమా దపవాహ్య దేవస్య దృఢవర్మణో మిత్రభావాన్వితతయా [5] ఆటవికస్య నృపతే ర్విన్ధ్యకేతో ర్గృహే స్థాపితా సతీ, స్నానాయ [6] నాతిదూర మిత్యగస్త్యతీర్థం గతే మయి క్షణాత్ కైరపి నిపత్య హతే విన్ధ్యకేతౌ రక్షోభిరివ నిర్మానుషీకృతే ద

నికి రఘు దిలీప నహుషులతో సమానునికి దృఢవర్మకు 'నేను (= కళింగరాజు) అడుగుచున్నను ఇతఁడు (= దృఢవర్మ) తన కూఁతును వత్సరాజునకు వాగ్దానము చేసినాఁడు' అని పగపట్టినవాఁడై పాడుకళింగుఁడు-వత్సరాజు గట్టిచెఱలో నున్నాఁడని సందు పొందినవాఁడై-(దృఢవర్మకు) ఇట్టి యాపదను చేయు నని యసంభావ్యవిషయము జరిగినదానినైనను నమ్మఁజాలకున్నాను. ఏమి! దైవము ఈవిధముగా మా విషయమై కేవలము క్రూర మయినది! ఏల యన, ఆరాజపుత్త్రిని 'ఎట్లో ఒకయట్లు 'ఈమెను వత్సరాజునకు అర్పించి (నా)దొరను (దృఢవర్మను) ఋణవిముక్తుని చేయుదును గాక' యని నేను ప్రళయకాలఘోరమైన యటువంటి ముట్టడిగందరగోళమునుండియు తప్పించి తెచ్చి (నవాఁడ నై) దృఢవర్మ నరపతికి మైత్రికలవాఁ డగుటచేత అడవిదొర వింధ్యకేతునియింటను ఉంచి స్నానమునకు అతిదూరముగానిచేత అగస్త్యతీర్థమునకు పోయి యుండఁగా క్షణములో ఎవరో వచ్చి (పల్లె) మీఁదఁబడి వింధ్యకేతుని చంపి రక్కసులువోలె చోటిని నిర్జ

1. రఘువు, దిలీపుఁడు, నహుషుఁడును తొంటిగొప్పరాజులు జేతలు.

2. ఆకూఁతుపేరు ప్రియదర్శిక(=ప్రియమును చూపునది), ఆమె ఇందు నాయిక.

3. కళిఙ్గానాం రాజా కళిఙ్గః - కళిఙ్గ శ్చాసౌ హతక శ్చేతి కళిఙ్గహతకః-
* 'కుత్సితాని కుత్సనై రి'తి సమాసః.

4. 'అసంభావ్యే తు యత్సత్యమ్.'

5. అటవ్యాం భవః ఆటవికః - అడవియం దుండువాఁడు.

6. నాతిదూరమ్ = అనతిదూరమ్, నఞర్థేన నశబ్దేన సు ప్సు పేతి సమాసః, అనఞ్త్వా న్నలోపాభావః, పృషోదరాదిత్వా ద్వా.

ర్గే స్థానే న జ్ఞాయతే కస్యాం మవస్థాయాం వర్తత ఇతి. నిపుణం చ విచిత మేత న్మయా సర్వం స్థానమ్. న జ్ఞాతం కిం తైరేవ దస్యుభి ర్నీతా కి మిహ దగ్ధేతి. త త్కిం కరోమి మన్దభాగ్యః! (విచిన్త్య) అయే! శ్రుతం మయా బన్ధనాత్ పరిభ్రష్టః ప్రద్యోతతనయా మపహృత్య వత్సరాజః కౌశామ్బీ మాగత ఇతి. కిం త త్రైవ గచ్ఛామి? (నిశ్వ స్యాత్మనో ఽవస్థాం పశ్యన్) అహహ! రాజపుత్ర్యా వినా తత్ర గత్వా కిం కథయిష్యామి? అయే! కథితం చాద్య విన్ధ్యకేతునా 'జీవతి తత్రభవాన్ దృఢవర్మా గాఢప్రహారజర్జరీకృతవపు స్తిష్ఠ తీతి. త దధునా స్వామిన మేవ గత్వా పాద పరిచర్యయా జీవిత శేష మాత్మనః సఫలీకరిష్యామి. (పరిక్ర మ్యోర్ధ్వ మవలోక్య) అహో! అతిదారుణతా శరదాతపస్య! య దేవ మనేకదుఃఖసంతాపితే నా ప్యతితీక్ష్ణో ఽవగమ్యతే!

ఘన బన్ధన ముక్తో ఽయం
కన్యాగ్రహణాత్ పరం తులాం

నముచేసి కాల్పఁగా (ఆరాజపుత్త్రి) ఏయవస్థలో నున్నదో తెలియకున్నది. మఱి చక్కఁగా వెదకితిని ఈచోటి నెల్లను. తెలియ దాయెను, ఆదొంగలే (ఆశత్రువులే) కొనిపోయిరో, ఇట కాలిపోయినదో, అని. కావున ఏమి సేయుదును అల్పపుణ్యుఁడను! (ఆలోచించి) ఆహా! వింటిని నేను 'ఖయిదునుండి వెలువడినవాఁడై ప్రద్యోతుని కూఁతును అపహరించి వత్సరాజు కౌశాంబికి వచ్చె' నని. ఏమి అచటికే పోదునా? (నిట్టూర్పు పుచ్చి తన యవస్థను చూచుకొనుచు) అహాహా! రాజపుత్త్రి లేక (=రాజపుత్త్రిని తోడ్కొనక) అచటికి పోయి ఏమి చెప్పుదును? ఆహా! చెప్పినాఁడు మఱి నేఁడు వింధ్యకేతుఁడు 'బ్రదికి యున్నాఁడు పూజ్యుఁడు దృఢవర్మ, గాటపు దెబ్బలచేత (-దెబ్బలకు) శిథిలము సేయఁబడిన యొడలుగలవాఁడై (ఒడలు శిథిలమై) యున్నాఁడు.' అని. కావున ఇపుడు (నా) యేలినవారికడకే పోయి (తత్) పాదసేవచేత నాయొక్క ఆయుశ్శేషమును సఫలీకరించెదను. (నడచి మీఁదు చూచి) అహో! శరత్కాలపు టెండ ఎంతతీక్ష్ణముగా నున్నది! ఎట్లన, ఇవ్విధమున నానాశోకములచే క్రాఁగుచున్న నాకున్ను కడుతీవ్రముగా తెలియనగుచున్నది. [1]

గట్టిచెఱనుండి విడివడి వాసవదత్తను హరించి మహోత్కర్షను పొంది తనరాజధానిం జేరి వత్సరాజు ఎట్లు ప్రతాపించు

1. మూలమందలి కర్మార్థకప్రయోగము అనువాదములో ఆంధ్రభాషోచితముగా కర్త్రర్థకముగా మార్పఁబడినది; ఇట్లే ఉత్తరత్ర అక్కడక్కడ.

| | |
|---|---|
| ప్రాప్య | చున్నాఁడో అట్లె ఈసూర్యుఁడు మేఘము |
| రవి రధిగతస్వధామా | లయావరణమునుండి విడివడి కన్యారాశిం గూడినయనంతరము తులారాశింజేరి తన (పూర్వ) తేజస్సును (మఱల) పొందినవాఁ |
| ప్రతపతి ఖలు వత్సరాజఇవ. | డై మిక్కిలి క్రాఁచుచున్నాఁడు. |
| [ఇతి నిష్క్రాన్తః. | [అని నిష్క్రమించును. |

ఇతి శుద్ధవిష్కమ్భః.

---

ఘన బన్ధన ముక్తః = దిట్టమయిన చెఱనుండి విడివడినవాఁడై, కన్యా గ్రహణాత్ పరమ్ = వాసవదత్తను కైకొన్న యనంతరము, తులాం ప్రాప్య = సాటిని (అనఁగా ఉపమానత్వమును) పొంది, అ...మా - అధిగత = పొందఁబడిన - స్వ=తన-ధామా = చోటుగలవాఁడైన, వత్సరాజఇవ = ఉదయనునివలె (అనఁగా ఉదయనుఁడు ఎట్లు ప్రతాపమును నెఱపుచున్నాఁడో అట్లు), అయం రవిః = ఈ సూర్యుఁడు, ఘ...క్తః—ఘన = మేఘములయొక్క - బంధన = ఆవరణమునుండి - ముక్తః = విడివడిన వాఁడై, కన్యా గ్రహణాత్ పరమ్=కన్యారాశిని కూడిన యనంతరము, తులాం ప్రాప్య = తులారాశిని చేరి, అ...మా—అధిగత = పొందఁబడిన - స్వ = తనయొక్క - ధామా = తేజస్సుగలవాఁడై, ప్రతపతి = మిక్కిలి క్రాఁచుచున్నాఁడు.

సూర్యుఁడు వర్షర్తువుకడపట కన్యలో నుండును, శరదృతువునారంభమున తులలో ప్రవేశించును. తులాధిరోహణమునకు ప్రయోగాంతరము—

'దురధిగమః పరభాగో యావత్పురుషేణ పౌరుషం న కృతమ్
జయతి తులా మధిరూఢో భాస్వానపి జలదపటలాని.'

ఇందు వత్సరాజప్రస్తావము వెంటనే ఆపాత్రము ప్రవేశించు నని సూచించుచున్నది.

---

# ప్రథమాఙ్కః.

(తతః ప్రవిశతి రాజా [2] విదూషకశ్చ.)

రాజా.—

[3] భృత్యానా మవికారితా పరిగతా,
దృష్టా మతి ర్మన్త్రిణాం,
మిత్రా ణ్యప్యుపలక్షితాని, విదితః
పౌరానురాగోఽధికమ్,
నిర్వ్యూఢా రణసాహసవ్యసనితా,
స్త్రీరత్న మాసాదితం;
నిర్వ్యాజాదివ ధర్మతః కిమివ న
ప్రాప్తం మయా బన్ధనాత్.

(అంత రాజు విదూషకుఁడు ప్రవేశింతురు.)

రాజు.—త్రికరణశుద్ధిగా ఆచరించి నధర్మమువలననుంబోలె నాకు చెఱవలన సకలశ్రేయములును కలిగినవి:—ఎట్లనఁగా:—నాసేవకులు నాకై పడినపాటువలన వారికి నాయందు భక్తి తప్పమి నాకు తెలియనయినది, నన్ను చెఱనుండి విడిపించుటకు యౌగంధరాయణాదిమంత్రులు చేసినయద్భుతోపాయములవలన వారి ప్రజ్ఞావిశేషము నాకు అనుభవమునకు వచ్చినది, మిత్రులయొక్క మైత్రియు తేటపడినది, ప్రజలకు నాయందుఁ గలయనురక్తి మిక్కిలి తెల్లమయినది, రణములో వాసవదత్తాబంధువుల నోడించి య[illegible]దరిని తెచ్చితిని గావున నారణక్రీడాలాలస నెఱవేఱినది, లోకోత్తరయైనకన్య నన్నువలచి నాకు దొరకినది.

1. అంక మనఁగా నాటకాదులయందలి పరిచ్ఛేదము. తత్స్వరూపము సాహిత్య దర్పణము 278-వ కారికవలనం దెలియ నగును.

2. విదూషకుఁడు—నాయకునికి శృంగారసహాయుఁడు, బ్రాహ్మణుఁడు, కుసుమవసంతాదినామధేయుఁడు, క్రియా శరీర వేష భాషాదులచేత హాస్యము పుట్టించువాఁడు, జగడగొండి, తనపనిలో నేర్పరి.

3. భృత్యానామ్ = సేవకులయొక్క, అవికారితా=(భక్తి) మాఱమి, పరిగతా= ఎఱుకవడినది, మన్త్రిణాం మతిః దృష్టా = (యౌగంధరాయణాది) మంత్రుల తెలివి చూడఁబడినది, మిత్రాణి అపి ఉపలక్షితాని=స్నేహితులు కూడ ఎఱుఁగఁబడిరి, పౌరానురాగః—పౌర=పురజనులయొక్క—అనురాగః=ప్రేమ, అధికం విదితః = మిక్కిలి తెలి[illegible]డినది, [illegible]...తా—రణ = యుద్ధమందలి—సాహస= తెగువయందలి—వ్యసనితా = ఆసక్తత, నిర్వ్యూఢా = నెఱవేర్పఁబడినది, స్త్రీరత్నమ్ = శ్రేష్ఠమయినకన్య, ఆసాదితమ్=పొందఁబడినది, మయా = నాచేత, నిర్వ్యాజాత్ ధర్మతః ఇవ=నిష్కపటముగా

విదూ.—(సరోషమ్) భో వయస్య, కథం త మేవ [1] దాస్యాఃసుతం బన్ధనహాతకం ప్రశంససి! త దిదానీం విస్మృతం, య న్నవగ్రహఇవ యూథపతిః [2] ఖలఖలాయమాన లోహశృఙ్ఖలా బన్ధ పరిస్ఖలచ్చరణః శూన్య ముఖపుష్కర పిశునితహృదయసంతాపః రోషవశో త్తమ్భిత దృష్టి రధిగత ధరణీపృష్ఠః రజనీ ష్వపి నిద్రాసుఖం న ప్రాప్నోషి?

(కోపముతో) ఓ మిత్రమా, ఏమి వానినే లంజెకొడుకును పాడుచెఱను పొగడుచున్నావు! దానిని ఇప్పుడు మఱచితివా? దేని ననఁగా—క్రొత్తగా పట్టఁబడిన పరికాని (=ఏనుఁగుమందను నడపునట్టి యేనుఁగు)వలె ఖలఖలమని శబ్దించుచున్న యినుపసంకెలకట్టుచేత తొట్రిలుచున్న పాదములతో వట్టి (=మనోభావము ఏమాత్రమును తెలియరాని) మోముదమ్మిచేత తెలుపఁబడిన మనోదుఃఖముతో కోపాధీనత చేత నిలువుచూపుపడి నేలవీపున (= వట్టి నేలను) పరుండి రాత్రులందు సయితము నిద్దురసుఖమును పొందవే (దానిని).

రాజా.—వసన్తక, దుర్జనః ఖల్వసి; పశ్య:

రాజు.—వసంతకుఁడా, దుర్జనుఁడవు సుమా నీవు; చూడు:

ఆచరింపఁబడిన ధర్మమువలననుం బోలె, బన్ధనాత్=ఖయిదువలన, కి మివ న ప్రాప్తమ్= ఏ దఁట పొందఁబడలేదు? (సర్వమును పొందఁబడిన దనుట). అవికారితా—వికారః ఏషా మ స్తీతి వికారిణః - తె న భవ న్తీ త్యవికారిణః - తేషామ్ భావః అవికారితా. పౌరాః=పురే భవాః. స్త్రీరత్నమ్ = స్త్రీ చాసౌ రత్నం చేతి, * 'రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపీ' త్యమరః. దోషమందు గుణకల్పనరూప మైనలేశాలంకారము * 'లేశః స్యా ద్దోషగుణయోః గుణదోషత్వకల్పనమ్.'

1. దాస్యాఃసుతః—ఇదియొకతిట్టు * అలుక్సమాసము.

2. ఇట రాజ్ఞానకు చెప్పఁబడిన దొల్ల ఏనుఁగునకును అన్వయించును. ఇంతచేటు చేసినబంధనమును పొగడుట సరి గా దని ప్రశ్నాభిప్రాయము. ఉపమాలంకారము * 'ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీ రుల్లసతి ద్వయోః.'

విదూ.—భో వఅస్స, కహం తం ఎవ్వ దాసీఏ సుదం బంధణ హాదఅం పసంససి! తం దాణిం విసుమరిదం జం ణవగ్గహో విఅ జూహావఈ ఖలఖలాయమాణ లోహ సింఖలా బంధపరిక్ఖలంత చలణో సుణ్ణ ముహ పొక్ఖర పిసుణిద హిఅఅ సందావో రోసవసు త్తంభిఅ దిట్ఠీ అహిగఅ ధరణిపిట్ఠో రఅణీసు వి ణిద్దాసుహం ణ పావేసి?

[1] దృష్టం చారక మన్ధకారగహనం,
నో తన్ముఖేన్దుద్యుతిః,
పీడా తే నిగళస్వనేన, మధురా స్త
స్యా గిరో న శ్రుతాః;
క్రూరా బన్ధనరక్షిణో౽ద్య మనసి,
స్నిగ్ధాః కటాక్షా న తే;
దోషాన్ పశ్యసి బన్ధనస్య, న పునః
ప్రద్యోతపుత్ర్యా గుణాన్.

చీఁకటిచేత చొరరాని చెఱను లెక్కింతవుగాని ఆసుందరియొక్క ముఖచంద్రప్రభను లెక్కింపవు; సంకెలశబ్దముచేత నీకు బాధకలిగెనేగాని ఆకోమలియొక్క మధురవాక్కులు గణనకు రావాయెను; క్రూరు లయినచెఱకాపరులను తలపోసెదవేగాని చెలిమి యొలికెడి యాక్రేఁగంటి చూపులను తలంపవు; చెఱయొక్క దోషములనే ఎన్నెదవుగాని వాసవదత్తయొక్క గుణములను ఎన్నవు.

విదూ.—(సగర్వమ్) యది నిగళబన్ధనం సుఖబన్ధనం భవతి తర్హి కస్మాత్ త్వం దృఢవర్మా బద్ధ ఇతి కళిఙ్గరాజస్యోపరి రోష ముద్వహసి?

విదూ.—(గర్వముతో) సంకెలలతో కట్టుట సుఖముతో కట్టుట యగునెడల ఏల నీవు దృఢవర్మను (సంకెలలం) గట్టినాఁడని కళింగరాజుమీఁద కోపము దాల్చెదవు?

రాజా.—(విహస్య) ధి ఙ్మూర్ఖ! న ఖలు సర్వో వత్సరాజః, య ఏవం

రాజు.—(నవ్వి) ఛీ! మూర్ఖుఁడా! ప్రతివాఁడును ఇవ్విధమున వాసవదత్తను

1. అన్ధకార గహనం చారకం దృష్టమ్ = చీఁకటిచే చొరరాని చెఱ గణింపఁబడినది (గాని), త...తిః—తత్=ఆసుందరియొక్క—ఇన్దు = చంద్రునివంటి—ముఖ = మొగముయొక్క—ద్యుతిః=లావణ్యము, నో దృష్టా=గణింపఁబడ దాయెను; తే నిగళ స్వనేన పీడా (జాతా)=నీకు సంకెల శబ్దముచేత=బాధ (గలిగెనేగాని), తస్యాః మధురాః గిరః న శ్రుతాః=ఆచెలువయొక్క తియ్యని మాటలు వినఁబడవాయెను; అద్య మనసి క్రూరాః బన్ధన రక్షిణః (వర్తన్తే)=ఇప్పుడు (నీ) మనస్సులో క్రూరులయిన చెఱ కాపరులు (కలరు) (గాని), స్నిగ్ధాః తే కటాక్షాః న = నిద్దములయిన యా (= అకోమలియొక్క) కడకంటిచూడ్కులు (లేవు); బన్ధనస్య దోషాన్ పశ్యసి = చెఱయొక్క దోషములను చూచెదవు (గాని), ప్రద్యోత పుత్ర్యాః గుణాన్ పునః న (పశ్యసి) = ప్రద్యోతుని కొమారితయొక్క గుణముల నన్ననో చూడవు. అనుజ్ఞాలంకారము
* 'దోష స్యాభ్యర్థ నానుజ్ఞా త త్రైవ గుణదర్శనాత్.'

విదూ.—జది ణిఅళబంధణం సుహబంధణం హోది, తా కీస తుమం దిఢవమ్మో బద్ధో త్తి కళింగరణ్ణో ఉవరి రోసం ఉవ్వహసి?

వాసవదత్తా మవాప్య బన్ధనా న్ని ర్యాస్యతి. త దాస్తాం తావ దియం కథా. విన్ధ్యకేతో రుపరి బహూని దివసాని విజయసేనస్య ప్రేషితస్య; న చా ద్యాపి తత్సకాశాత్ కశ్చి దాగతః. త దాహూయతా మమా త్యో రుమణ్వాన్, తేన సహ కిఞ్చి దాలపితు మిచ్ఛామి.

(ప్రవిశ్య ప్రతీహారీ)

జయతు జయతు దేవః. ఏష ఖలు విజయసేనః అమాత్యో రుమణ్వా నపి ప్రతీహారభూమి ముపస్థితౌ.

రాజా.—త్వరితం ప్రవేశయ.

ప్రతీ.—[1] య ద్దేవ ఆజ్ఞాపయతి. [ఇతినిష్క్రాన్తా.

రుమణ్వాన్.—(విచిన్త్య)

[2] తత్క్షణ మపి నిష్క్రాన్తాః కృతదోషాఇవ వి నాపి దోషేణ

పొంది చెఱనుండి వెలువడునట్టి వత్సరాజు గాఁడు. కావున ఈకథ య టుండుఁగాక. వింధ్యకేతునిమీఁదికి బహుదినములు (అయినవి) విజయసేనుని పంపి. మఱి అతని (విజయసేనుని) కడనుండి ఇప్పటికిని ఎవ్వఁడును రాలేదు. కనుక మంత్రిని రుమణ్వంతుని పిలువుము, అతనితో కొంచెము సంభాషింపఁ గోరియున్నాను.

(ద్వారపాలిక ప్రవేశించి)

జయము జయము ఏలినవారికి. వీరుగో విజయసేనుఁడును మంత్రి రుమణ్వంతుఁడును ద్వారప్రదేశమందు వచ్చియున్నారు.

రాజు.—త్వరగా ప్రవేశపెట్టుము.

ప్రతీ.—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రుమణ్వంతుఁడు.—(ఆలోచించి)

రాజసేవకులు రాజసన్నిధినుండి అప్పుడే వెలువడినవా రయినను తమయందు తప్పేద మేమియు లేకయే ప్రాయికముగా

ప్రతీ.—జేదు జేదు దేవో. ఏసో క్ఖు విజఅసేణో అమచ్చో రుమణ్ణో వి పడిహారభూమిం ఉవట్ఠిదో.

ప్రతీ.—జం దేవో ఆణవేది.

1. యత్ = దేనిని, దేవః = ప్రభువు, ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించుచున్నాఁడో, దానిని చేసెదను అని శేషము.

2. భృత్యాః = (రాజ) సేవకులు, తత్ క్షణం నిష్క్రాన్తాః అపి = ఆక్షణమే (రాచనగరినుండి) వెలువడినవా రయ్యును, దోషేణ వినా అపి = తప్పు లే కున్నను,

ప్రవిశన్తి శఙ్కమానా రాజకులం ప్రాయశో భృత్యాః.

(ఉపసృత్య) జయతు దేవః.

రాజా.—(ఆసనం నిర్దిశ్య) రుమణ్వాన్, ఇత ఆస్యతామ్.

రుమ.— (సస్మిత ముపవిశ్య) ఏష ఖలు విన్ధ్యకేతో ర్విజేతా విజయసేనః ప్రణమతి.

[విజయసేన స్తథా కరోతి.

రాజా.—(సాదరం పరిష్వజ్య) అపి కుశలీ భవాన్ ?

విజ.—అద్య స్వామినః ప్రసాదాత్.

రాజా.—విజయసేన, ఉపవిశ్యతామ్. [విజ. ఉపవిశతి.

రాజా.—విజయసేన, కీదృశో విన్ధ్యకేతో ర్వృత్తాన్తః?

విజ.—దేవ, కి మపరం కథయామి! యాదృశః స్వామిని కుపితే.

రాజా.—తథాఽపి విస్తరతః శ్రోతు మిచ్ఛామి.

విజ.—దేవ, శ్రూయతామ్. ఇతో వయం దేవపాదాదేశాత్ య

తప్పిదము చేసినవారంబోలె రాజసన్నిధికి భయపడుచు భయపడుచుం బోవుదురు.

(సమీపించి) జయము ఏలినవారికి.

రాజు.—(ఆసనము చూపి) రుమణ్వంతుఁడా, ఇటఁ గూర్చుండుము.

రుమ.—(చిఱునగవుతో కూర్చుండి) వీఁడుగో వింధ్యకేతుని జయించినవాఁడు విజయసేనుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

[విజయసేనుఁ డట్లు చేయును.)

రాజు.—(ప్రీతితో కవుంగిలించి) నీవు క్షేమమా ?

విజ.—ఇప్పుడు, ఏలినవారి యనుగ్రహమువలన.

రాజు.—విజయసేనుఁడా, కూర్చుండుము. [విజ. కూర్చుండును.

రాజు.—విజయసేనుఁడా, ఏమి వింధ్యకేతుని సమాచారము?

విజ.—దేవా, వేఱే ఏమి చెప్పుదును! ఏలినవారు కోపగించిన నేదో (అదే.)

రాజు.—అట్లయినను సవిస్తరముగా వినఁ గోరుచున్నాను.

విజ.—దేవరా, వినుము. ఇటనుండి మేము ఏలినవారి పాదములయానచేత ని

ప్రాయశః తఱుచుగా కృత దోషాః ఇవ = తప్పు చేసినవారు వోలె, శఙ్కమానాః = వెఱచుచు, రాజ కులం ప్రవిశన్తి = రాచ నగరిని చొత్తురు. విభావనాలంకారము, * 'విభావనా వి నాపి స్యా త్కారణం కార్యజన్మ చేత్.' కృతదోషా ఇవ ఉత్ప్రేక్షాలంకారము, 'భవే త్సంభావ నోత్ప్రేక్షా.'

థాదిష్టేన [1] కరి తురగ పదాతి సైన్యేన మహాన్త మప్యధ్వానం దివసత్రయే ణోల్లఙ్ఘ్య ప్రభాతవేలాయా [2] మతర్కితా ఏవ విన్ధ్యకేతో రుపరి నిపతితాః స్మః.

యోగింపఁబడిన గజాశ్వ పదాతి సైన్యముతో ఎంతయో దారిని మూఁడుదినములలో దాఁటి వేగుతతిని కేవలము ఆకస్మికముగా వింధ్యకేతునిమీఁద పడితిమి.

రాజా.—తత స్తతః?

రాజు.—అంతట? అంతట?

విజ.—తతః సో౽ప్యస్మత్కలకలాకర్ణనేన ప్రతిబుద్ధః [3] కేసరీవ విన్ధ్యకన్దరా న్నిర్గత్య విన్ధ్యకేతు రనవేక్షిత బలవాహనో యథాసన్నిహితకతిపయసహాయః సహసా ఖ ముద్ఘోషయ న్నస్మా నభియోక్తుం ప్రవృత్తః.

విజ.—అంతట ఆవింధ్యకేతుఁడును మాకోలాహలము విని మేలుకొని (తెలిసికొని) సింగమువోలె వింధ్యగుహనుండి వెలువడి దండును గుఱ్ఱమును ఎదురుసూడక అప్పటికి తనతో నున్న కొంచెపాటి సహాయులతో తటాలున ఆకాశము మాఱుసెలంగునట్లు (సింహనాదములు) సేయుచు మమ్ము తాఁక సమకట్టెను.

రాజా.—(రుమణ్వన్త మవలోక్య సస్మితమ్) శోభితం విన్ధ్యకేతునా. తత స్తతః?

రాజు.—(రుమణ్వంతునిఁ గాంచి చిఱునగవుతో) తేజరిల్లినాఁడు వింధ్యకేతువు. అంతట? అంతట?

విజ.—తతో ఽస్మాభి రయ మసావితి ద్విగుణబద్ధమత్సరోత్సాహై ర్మహతా విమర్దేన నిశ్శేషిత సహాయః ఏక ఏవ వివర్ధితాధిక బల క్రోధ వేగో దారుణతరం సంప్రహార మకరోత్.

విజ.—అంతట మేము వీఁడే వీఁడే అని యినుమడిగా మత్సరోత్సాహంబులం బూని మిక్కిలి పోరి వానిసహాయులనెల్ల రూపుమాపితిమి. (అంత నతఁడు) ఒక్కరుండే బలమును క్రోధమును వేగంబును పెంచుకొని అతిక్రూరముగా పోరెను.

1. రథములను మానుట అడవిలో వానికి దారి లేనందున. పదాతిః—పాదాభ్యా మత తీతి పదాతిః.

2. అతర్కితాః=ఊహింపఁబడనివారమై.

3. వింధ్యకేతునికిని కేసరికిని గలసామాన్యధర్మములు—కలకలాకర్ణనము, ప్రతిబోధ, వింధ్యకందరనిర్గమనము, గర్జనము, తటాలునఁ దాఁకుటయు. ఉత్ప్రేక్ష.

రాజా.—సాధు! విన్ధ్యకేతో, సాధు!

రాజా.— బళి! వింధ్యకేతూ! బళి!

విజ.—కిం వా వర్ణ్యతే! దేవ, సంక్షేపతో విజ్ఞాపయామి :—

విజ.—ఏ మని వర్ణింతును! దేవరా, సంగ్రహముగా విన్నవించెదను:—

[1] పాదాతం పత్తిరేవ
ప్రథమతర మురః
క్షేపమాత్రేణ పిష్ట్వా,
దూరం నీత్వా శరౌఘై
ర్హారిణకుల మివ
త్రస్త మశ్వీయ మాశాః,
సర్వ త్రోత్సృష్టసర్వ
ప్రహరణనివహా
స్తూర్ణ ముత్ఖాయ ఖడ్గం
పశ్చాత్కర్తుం ప్రవృత్తః
కరిషు కదళికా
కాననచ్ఛేదలీలామ్.

తాను కాలరిగను మొట్టమొదట కాలరిదండును రొమ్ము త్రోపుడుమాత్రాననే నుగ్గుచేసి, బెదరిన లేటితండమో య నునట్లుగా గుఱ్ఱపుదండును బాణపరంపరచే దవ్వులకు తఱిమి, ఎల్లయాయుధముల మొత్తమును ఎల్లయెడలను విసరి వైచి, బిరాలున కత్తి దూసి, యనంతరము ఏనుఁగుదండులలో అరఁటితోఁటం గోయు నాటను ఆడం దొడంగెను.

1. పత్తిరేవ=తాను కాలుబంటే అయి (=వాహన మెక్కక), పాదాతమ్=కాల్బంట్లసమూహమును, ప్రథమతరమ్=మొట్టమొదట, ఉరః క్షేప మాత్రేణ=రొమ్మున కొట్టుట మాత్రముచేత (వారిని చేతఁగాని యెత్తి చక్రాతిపైఁ గొట్టినట్లు తనకడింది వెడంద రొమ్మునం గొట్టుటచేత అని యేని, వారిరొమ్ములమీఁద గ్రుద్దులు గ్రుద్ది యని యేని, తనరొమ్ముతో వారిని ఒకరిమీఁద నొకరు పడి నలిగి చచ్చునట్లుగా త్రోపులుత్రోసి యని యేని, అర్థము.), పిష్ట్వా = నుగ్గుచేసి, అశ్వీయమ్ త్రస్త హరిణకులమ్ ఇవ శరౌఘైః దూరం నీత్వా = గుఱ్ఱపుదండును బెదరిన లేడిమందనో యనునట్లుగా (శర=) బాణముల (ఓఘైః=) సమూహములచేత దూరమునకు తఱిమి, సర్వత్ర ఉత్సృష్ట సర్వ ప్రహరణ నివహః (సన్) = ఎల్లయెడలను వైవఁబడిన సకలమైన యాయుధముల సమూహము కలవాఁడు (అయి), తూర్ణం ఖడ్గమ్ ఉత్ఖాయ=శీఘ్రముగా కత్తిని దూసి, పశ్చాత్ = అనంతరము, కరిషు = ఏనుఁగులయందు, కదళికా కానన చ్ఛే (ఛే)ద లీలాం కర్తుం ప్ర

ఏవం బల త్రితయ మా
కుల మేక ఏవ
కుర్వన్ కృపాణ రుధిర
చ్ఛురి తాంసకూటః
శస్త్ర ప్రహార శత జ
ర్జరి తోరు వక్షాః
శ్రాన్త శ్చిరా ద్వినిహతో
యుధి విన్ధ్యకేతుః.

ఈరీతిగా యుద్ధములో అసహాయుండడై (మన) మూఁడంగములబలమును చీకాకుపఱిచి కత్తిని ఎగుబుజమున మోపుకొని దానినుండి నెత్తురు బుజమును కమ్ముచుండఁగా ఆయుధములగాయములు నూర్లకొలఁది ఱొమ్మును చక్కాడఁగా బడలి ఎట్టకేలకు వింధ్యకేతువు కూలెను.

వృత్తః = అరఁటి యడవిని నఱకుటయనెడి యాటను చేయుటకు (ఆడుటకు) కడంగెను (అరఁటియడవిని నఱుకునంత సులువుగా ఏనుగులను నఱుకం దొడంగెను. ఏనుఁగుల తొండములును కాళ్లును ముఖ్యముగా వ్రేటునకు అందునట్టివి, లావుగాను నిలువుగాను అరఁటికంబములవలె నుండును, గావున నిట్లు చెప్పుట; సులువుగా నని భా.) పదాతీనాం సమూహః పాదాతమ్. పద్యత ఇతి పత్తిః. అశ్వానాం సమూహః = అశ్వీయమ్. ద్వితీయపాదమున ఉత్ప్రేక్ష. చతుర్థమున పదార్థవృత్తినిదర్శన;

'వాక్యార్థయోః సదృశయో రైక్యారోపో నిదర్శనా...
పదార్థవృత్తి మప్యేకే వద న్త్యన్యాం నిదర్శనామ్.'

1. ఏవమ్ యుధి ఏక ఏవ బల త్రితయమ్ ఆకులం కుర్వన్ = ఈరీతిగా యుద్ధములో ఒక్కరుండే దండుయొక్క మూఁడు అంగములను (ఏనుఁగులు గుఱ్ఱములు, కాలరులు అను మూఁడంగములను) చీకాకు చేసి, కృ...టః—కృపాణ = కత్తియొక్క—రుధిర = నెత్తురుచేత (కత్తినుండి కాఱుచున్న శత్రురక్తముచేత) ('కిరణ' అనుపాఠమున వెలుఁగులచేత)—ఛురిత = వ్యాప్తమయిన—అంస కూటః = (కూట=) శిఖరమువంటి (అంస=) బుజముగలవాఁడై, శస్త్ర ప్రహార శత జర్జరిత ఉరు వక్షాః = ఆయుధముల దెబ్బల నూర్లచేత శిథిలితమయిన గొప్ప ఱొమ్ముకలవాఁడై, శ్రాన్తః = బడలినవాఁడై, విన్ధ్యకేతుః చిరాత్ వినిహతః = వింధ్యకేతువు చాలసేపటికి చంపఁబడెను. కృపా...టః—నఱికి నఱికి విసిగి కత్తిని బుజమున మోపుకొని నిలిచె ననుట. ఉరు వక్షాః—గొప్ప ఱొమ్ము మిక్కిలిబలవంతుని కుండును. వక్షస్సును చెప్పుటచే శత్రువులకు వెన్నియ్య లే దనిభా. చిరాత్—బడలియు త్వరగా కూలఁ డాయె నని భా. శ్రాన్తః—బడలినయనంతరము కూల్చితిమి గాని తత్పూర్వము కూల్పలే కుంటి మని యతనిచేవను పొగడుట.

రాజా.—రుమణ్వన్, సత్పురుషకులోచితమార్గ మనుగచ్ఛతో[1] యత్సత్యం వ్రీడితా ఏవ వయం విన్ధ్యకేతో ర్మరణేన.

రాజు.— రుమణ్వంతుఁడా, సజ్జనకులమునకుఁ దగినమార్గము ననుసరించిన వింధ్యకేతుని యీయసంభావనీయమరణముచే మేము నిజముగా లజ్జితులముసుమా.

రుమ.— దేవ, త్వద్విధానా మేవం [2] గుణైకపక్షపాతినాం రిపో రపి గుణాః ప్రీతిం జనయన్తి.

రుమ.— దేవా, మీబోఁటిగుణైకపక్షపాతులకు పగవాని వయినను, గుణములు ఈవిధముగా అనురక్తిం బుట్టించును.

రాజా.—విజయసేన, అస్తి కి ఞ్చి దపత్యం విన్ధ్యకేతో ర్యత్రా స్య పరితోషస్య ఫలం దర్శయామి?

రాజు.—విజయసేనుఁడా, వింధ్యకేతునికి బిడ్డ ఏ మేని కలదా, దానియందు ఈప్రీతికి ఫలమును చూపుటకు?

విజ.—దేవ, ఇద మపి విజ్ఞాపయామి.—ఏవం సబన్ధుపరివారే హతే విన్ధ్యకేతౌ, త మనుసృతాసు [3] సహధర్మచారిణీషు, విన్ధ్యశిఖరాశ్రితేషు [4]జనపదేషు వినష్టేషు, శూన్యభూతే తత్ స్థానే, 'హా తాత! హా మాతః' ఇతి కృతకృపణప్రలాపా విన్ధ్యకేతో ర్దేశ స్వభిజాతరూపా కన్యకా కాచిత్ తద్దుహితే త్యస్మాభి రానీతా ద్వారి తిష్ఠతి. తాం ప్రతి దేవః [5] ప్రమాణమ్.

విజ.—దేవరా, ఇదియు విన్నవించెద:—ఈవిధముగా బంధుపరిజనసమేతముగా వింధ్యకేతువు మడిసినంతట అతని ధర్మపత్నులు అతనితో సహగమనము చేసిరి, వింధ్యశిఖరముల కెక్కినప్రజలు పరారియైరి, (అట్లు) పాడైనయాచోట 'అయ్యో! నాయనా! అయ్యో! అమ్మా!' అని దీనముగా విలపించుచు సుందరమూర్తి యొకానొక కన్యక వింధ్యకేతునియింట నుండఁగా అతనికూఁతు రని తలఁచి మేము తెచ్చితిమి, ద్వారమందు ఉన్నది. ఆమెనుగూర్చి యేలినవారిచిత్తము.

1. యత్సత్యమ్—ఈశబ్దసముదాయము అసంభావనీయమును సూచించును * 'అసంభావ్యే తు యత్సత్యమ్' అని భరతవచనము.

2. గుణేషు ఏకః (ఏకాన్తః) పక్షపాతో యేషాం తే గుణైకపక్షపాతినః.

3. సహధర్మచారిణీ—సహ = పెనిమిటితోఁగూడ—ధర్మ = వేదవిహితకర్మను— చారిణీ = చేయుశీలముగలది, ధర్మపత్ని యనుట.

4. జనపదేషు భవాః జానపదాః = పల్లెలయం దుండువారు, (ప్రజలు).

5. ప్రమాణమ్ = ప్రమాత = కర్తవ్య మెఱింగినవాఁడు.

రాజా.—[1] యశోధరే, గచ్ఛ త్వమేవ వాసవదత్తాయై సమర్పయ. వక్తవ్యా చ దేవీ 'భగినీబుద్ధ్యా త్వయైవ సర్వదా ద్రష్టవ్యా. నృత్యగీత వాద్యాదిషు విశిష్టకన్యకోచితం సర్వం శిక్షయితవ్యా. యదా వరయోగ్యా భవిష్యతి తదా మాం స్మారయే' తి.

రాజు.—యశోధరా, పోయి నీవే (ఆకన్యను) వాసవదత్తకు అప్పగింపుము. అప్పగించి దేవితో చెప్పుము:—"చెల్లెలినిగాఁ దలఁచి నీవే ఎల్లప్పుడును చూచుకోవలసినది. ఆట పాట వాద్యములు లోనగు వానియందు ఉత్తమకన్యకలకు తగిన దెల్ల నేర్పింపవలసినది. ఎప్పుడు పెండ్లికి తగిన దగునోఅప్పుడు మాకు జ్ఞప్తిసేయవలసినది." అని.

ప్రతీ.—యదాజ్ఞాపయతి దేవః.

[ఇతి నిష్క్రాన్తా.

ప్రతీ.—ఏలినవారియాజ్ఞ.

[అని నిష్క్రమించును.

(నేపథ్యే వైతాళికః)

[2] లీలామజ్జళమజ్జనోపకరణ
స్నానీయసంపాదినః
సర్వాన్తఃపురవారవిభ్రమవతీ
లోకస్య తే సంప్రతి
ఆయాసస్ఖలదంశుకావ్యవహిత
చ్ఛాయావదాతైః స్తనై
రుత్క్షిప్తాపరశాతకుమ్భకలశై
ర్వాలం కృతా స్నానభూః.

(నేపథ్యమున స్తుతిపాఠకుఁడు)

దేవా, సవిలాసమైన నీమంగళస్నానమునకై వలయుగిండులను గంధచూర్ణమును అంతఃపురవారవిలాసిను లెల్లరును సమకూర్చుచున్నారు. ఆబడలికచేత సన్ననిపైట జాఱఁగా కుచములు మఱుఁగుతొలఁగిన బంగారువన్నెలావణ్యముతో ప్రకాశించుచు స్నానభూమికి అలంకారముగానున్నవి. వానిచేత స్నానభూమి వారు తెచ్చియుంచిన బంగారుకలశములకంటె వేఱుగా తానును నీస్నానమునకై బంగారుకలశములను ఎత్తినదో యనునట్లు తోఁచుచున్నది.

1. యశోధర.—ద్వారపాలిక పేరు. ఇది రుమణ్వద్విజయసేనులను రాజసన్నిధిం బ్రవేశపెట్టి ద్వారముకడ నిలిచియున్నది.

2. సంప్రతి = ఇప్పుడు, తే = నీయొక్క, స్నానభూః = స్నానభూమి, లీలా మజ్జళ మజ్జన ఉపకరణ స్నానీయ సంపాదినః = విలాసయుక్తమయిన శుభ స్నానము యొక్క సాధనములను గంధచూర్ణమును సమకూర్చునదైన, సర్వ అన్తఃపుర వారవిభ్రమవతీ లోకస్య = సమస్తమయిన యంతిపురి వెలయెమ్మెకత్తెల సమూహముయొక్క, ఆయాస స్ఖలత్ అంశుక వ్యవహిత చ్ఛా (ఛా) యా అవదాతైః స్తనైః=శ్రమచేత జాఱుచున్న వలిపముచేత చాటుసేయఁబడని లావణ్యము గలవై గౌరవర్ణములయిన పాలిండ్ల

రాజా.-(ఊర్ధ్వ మవలోక్య) అయే!
కథం నభోమధ్య మధ్యాస్తే భగవా
న్సహస్రదీధితిః! సంప్రతి హి:—
1 ఆభా త్యర్కాంశుతాపాత్
క్వథ దివ శఫరో
ద్వృత్తనై ర్దీర్ఘికామ్భః;
ఛత్త్రాభం నృత్తలీలా
శిథిల మపి శిఖీ
బర్హభారం తనోతి;
ఛాయాచక్రం తరూణాం
హరిణశిశు రుపై
త్యాలవాలామ్బులుబ్ధః;
సద్య స్త్యక్త్వా కపోలం
విశతి మధుకరః
కర్ణపాళీం గజస్య.

రాజా.—(మీఁదఁ గాంచి) అహో! ఏమి వేవెలుఁగుల దేవుఁడు మింటి నడిమికి వచ్చినాఁడు! ఇప్పుడు నిశ్చయముగా:—

దిగుడుబావిలోని యుండకాఁగుడు నీళ్లలో నుండలేక బేడిసచేఁపలు పైకి తూలుచున్నవి, అవి తూలుట ఎండవేఁడికి ఆ నీళ్లు తెరలి అందునుండి బొబ్బలు లేచుచున్నట్లు ఉన్నది; నెమలి నర్తనముచే బడలియు నర్తనముచేత సడలిపోయిన తనపించెమొత్తమును గొడుగుగా విప్పి నెత్తిమీఁద నిల్పుకొనుచున్నది; లేడిపిల్ల నీళ్ళకై యాసించి చెట్లమొదటనే చుట్టువారుకొనియున్న నీడను నీళ్లుగలపాదుగా భ్రమపడి సమీపించుచున్నది. తటాలున తుమ్మెద ఏనుఁగుయొక్క ఎండ తగిలెడుగండమును వదలి చలువగల దగు చెవితొట్టలోఁ జొచ్చుచున్నది.

త్తో, ఉత్క్షిప్త అపర శాతకుమ్భ కలశా ఇవ=ఎత్తఁబడిన (వారు తెచ్చిన బంగారుగిండ్లు గాక) వేఱు బంగారుగిండ్లుగలదియో యన, అలంకృతా=కైసేయఁబడియున్నది. స్రస్
లత్ - అనుటచే ఒక్కొక్కతెయొక్కయు పయ్యెద జాఱఁగానే దాని స్తనములు అంతకుముందు అటనున్న గిండ్లకంటె తటాలున నెత్తఁబడిన మఱిరెండు గిండ్లో యన తోఁచుచుండును.(ఆ నేత్రోత్సవ మనుభవించుచు) జలకమాడ తటి ద్దైన దనుట. అంశుకము పలిప వస్త్రము, ఇది చాటున్నను కుచములకు సొంపే, ఎడలిన చెప్పవలసినదే లేదు. శా
తకుమ్భమ్—శతకుమ్భే పర్వతే భవమ్. ఉత్ప్రేక్షాలంకారము.

1. దీర్ఘికా అమ్భః శఫర ఉద్వర్తనైః అర్క అంశు తాపాత్ క్వథత్ ఇవ ఆభాతి =డిగ్గియయొక్క నీరు బేడిసలయొక్క ఎగురుటలచేత సూర్యుని కిరణముల వేఁడికి క్రాగుచున్న దోయనునట్లు ప్రకాశించుచున్నది, (కాఁగిననీట నుండలేక ఎగిరిపడు బేడిసమీలు నీరు తెర్లునప్పుడు లేచుబుడగలవలె నున్న వనుట); శిఖీ నృత్త లీలా శిథిలమ్ అపి బర్హ భారం ఛత్త్రాభం తనోతి=నెమలి నర్తనకేళిచే సడలినదాని పైనను పించెమొత్తమును గొడుగునాకారముగా విప్పుచున్నది, (సడలినను విప్పుట ఎండకు ఆఁగలేక); హరిణ శిశుః ఆలవాల అమ్బు లుబ్ధః సన్ తరూణాం ఛాయా చక్రమ్ ఉపైతి=లేడిపిల్ల పాదులలోని

| | |
|---|---|
| రుమణ్వాన్, ఉత్తిష్ఠ, ప్రవిశ్యా భ్యన్తర మేవ కృతయథోచితక్రియాః సత్కృత్య విజయసేనం ప్రేషయామః. | రుమణ్వంతుఁడా, లెమ్ము, లోపలికే పోయి యథోచితక్రియ లొనర్చి విజయసేనుని సత్కరించి పంపుదము. |
| [ఇతి నిష్క్రాన్తాః సర్వే. | [అందఱు నిష్క్రమింతురు. |

ఇతి ప్రథమోఽఙ్కః.

---

నీళ్ళయందు ఆసగొన్నదై చెట్లయొక్క మండలాకారమయిన నీడను దరియును, (పిల్లగనుక మండలాకారమయిన యానీడయే పాదులోని జల మని భ్రమసినది); మధుకరః గజస్య కపోలం సద్యః త్యక్త్వా కర్ణ పాళీం విశతి = తుమ్మెద ఏనుఁగుయొక్క చెక్కిటిని ఇప్పుడే వదలి శ్రోత్ర పుటమును చొచ్చుచున్నది, (గండమున కెండ తగులుటచే దానిని వీడి చెవిలోపల చలువ యయుండును గాన నటం జొచ్చుట). ఛత్త్రాభమ్=ఛత్త్రస్య ఆభేవాభా యస్య సః తమ్. స్వభావోక్త్యలంకారము, * 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.' ప్రథమపాదంబున * ఉత్ప్రేక్షయును, ద్వితీయపాదంబున * భ్రాంతిమద్ధ్వనియును స్వభావోక్తితో చేరియున్నవి. * 'స్యాత్ స్మృతి భ్రాన్తి సన్దేహై స్తదఙ్కాలఙ్కృతిత్రయమ్.'

# ద్వితీయోఽఙ్కః.

(తతః ప్రవిశతి విదూషకః)

విదూ.—నను భణితో౽స్మి ఇన్దీవరికయా 'వసన్తక, అద్య [1] ఉపవాసనియమస్థితా దేవీ వాసవదత్తా స్వస్తివాచననిమిత్తం [2] శబ్దాయత' ఇతి. తద్యావ [3] ద్ధారాగృహోద్యానదీర్ఘికాయాం స్నాత్వా దేవీపార్శ్వం గత్వా కుక్కుటవాదం కరిష్యామి. అన్యథా [4] అస్మాదృశా బ్రాహ్మణాః కథం రాజకులే ప్రతిగ్రహం కుర్వన్తి? (నేపథ్యాభిముఖ మవలోక్య) కథ మేష ప్రియవయస్యః అద్య దేవ్యా విరహోత్కణ్ఠావినోదననిమిత్తం ధారాగృహోద్యానం ప్రస్థితః. తద్యావ ద్వయస్యేన సహైవ గత్వా యథోద్దిష్ట మనుతిష్ఠామి.

(అంతట విదూషకుఁడు ప్రవేశించును.)

చెప్పినది గదా నాకు ఇందీవరిక, 'వసంతకుఁడా, నేఁడు వాసవదత్తాదేవి ఉపవాసవ్రత మవలంబించి స్వస్తిచెప్పుట నిమిత్తము (నిన్ను) పిలుచుచున్నది' అని. కావున ధారాగృహోద్యానంపుదిగ్గియలో స్నానముచేసి దేవియొద్దకుఁ బోయి పులిక్కి స్వస్తి పఠించెదను. అటు గాకేని, మాబోఁటి బ్రాహ్మణులు ఎట్లు రాచనగరిలో ప్రతిగ్రహము సేయుదురు! (తెరవంక చూచి) ఓహో! వీఁడుగో ప్రియవయస్యుఁడు నేఁడు దేవితోడియెడఁబాపువలని నెవ్వగను తలంగుటకు ధారాగృహోద్యానమునకు తరలినాఁడు. కావున, వయస్యునితోఁ గూడ నేపోయి నే ననుకొన్నట్లు చేసెదను.

1. ఉపవాసము అగస్త్యార్ఘ్యముకొఱకు. 2. శబ్దం కరో తీతి శబ్దాయతే. 3. ధారాగృహోద్యాన మని ఒకతోఁటపేరు; అందు ధారాగృహము (కేళాకూళియిల్లు) ఉండుటచే ఆపేరు వచ్చినది. 4. మాబోఁటిబ్రాహ్మణు లనఁగా వేదము రానివా రనుట.

విదూ.—ణం భణిదోహ్మి ఇందీవరిఆఏ 'వసంతఅ, అజ్జ ఉవవాస ణిఅమ ట్ఠిదా దేవీ వాసవదత్తా సొత్థివాఅణ ణిమిత్తం సద్దావేది' త్తి. జావ ధారాఘరుజ్జాణ దిగ్ఘిఆఏ ణ్హాఇఅ దేవీపాసం గదుఅ కుక్కుటవాదం కరిస్సం. అణ్ణహా అమ్హారిసా బమ్హణా కహం రాఅఉలే పడిగ్గహం కరంతి? (నేపథ్యాభిముఖ మవలోక్య) కహం ఏసో పిఅవఅస్సో అజ్జ దేవీఏ విరహుక్కంఠా విణోదణ ణిమిత్తం ధారాఘరుజ్జాణం పత్థిదో. తా జావ వఅస్సేణ సహ జెవ్వ గదుఅ జహోద్దిట్ఠం అణుచిట్ఠిస్సం.

(తతః ప్రవిశతి సోత్కణ్ఠో రాజా.)

రాజా.—

క్షామాంమఙ్గళమాత్రమణ్డనభృతం
మన్దోద్యమాలాపినీ
మాపాణ్డుచ్ఛవినా ముఖేన విజిత
ప్రాతస్తనేన్దుద్యుతిమ్
సోత్కణ్ఠాం నియమోపవాసవిధినా
చేతో మమోత్కణ్ఠతే
తాంద్రష్టుం ప్రథమానురాగజనితా
వస్థామివాద్య ప్రియామ్.

(రాజు తమకము గలవాఁడై ప్రవే.)

రాజు.—

ప్రియ నన్ను వలచినతొలితొలిదినములలో ఆవలపుచేత కృశించి, ఎక్కువమండనము లొల్లక మంగళమండనములు మాత్రము దాలిచి, సగము అలసతతో సగమే పలుకుచు, మొగము కొంచెపాటిపాండిమ దాల్చి ప్రభాతచంద్రునియొప్పును మించి సొంపారఁగా, కోర్కి గలదై నాకు నేత్రోత్సవముచేసినది. ఆదశలో ప్రియను వెండియుం గాంచుభాగ్యము చేకూరదు గావునను, వ్రతోపవాసముచేత నిపుడు అట్టి దశయే కలిగియున్నందునను, ఈదశలో నున్నప్రియను ఇపుడు చూచి ఆదశలోనే మఱలం గాంచినట్లు ఆనంద మొందఁగోరెదను.

క్షామామ్=కృశించినదియు, మ...తమ్—మఙ్గళమాత్ర=మంగళముమాత్రమే అయినట్టి (అనఁగా మంగళముమాత్రమే ప్రయోజనముగాఁగలయట్టి) మణ్డన = అలంకారములను—భృతమ్ = తాల్చినదియు, మన్ద ఉద్యమ ఆలాపినీమ్ = అలసమయిన ప్రయత్నముతోడ భాషించునదియు, ఆపాణ్డు చ్ఛ (ఛ) వినా ముఖేన విజిత ప్రాతస్తన ఇన్దు ద్యుతిమ్ = కొంచెము తెల్లని కాంతిగలదైన మొగముచే జయింపఁబడిన తెల్లవాఱుసమయపుఁ జంద్రుని కాంతిగలదియు, నియమ ఉపవాస విధినా సోత్కణ్ఠామ్ = వ్రతముకై ఉపవాసము సేయుటచేత సాభిలాషయు, (నయిన) తాం ప్రియామ్ = అట్టి (నా) ప్రియను, ప్రథమ అనురాగ జనిత అవస్థామ్ ఇవ = తొలియనురాగముచేత చేయఁబడిన దశగలదానింబోలె, అద్య ద్రష్టుం మమ చేతః ఉత్కణ్ఠతే = ఇప్పుడు చూచుటకు నాయుల్లము తమకపడుచున్నది. ప్రథమానురాగపక్షమున మండనములు ఎక్కువ దాల్పమి అరతిచేత. పాండిమ కొంచెపాటిగానే యుండుట అనురాగముయొక్క ఆరంభదశ యగుటచేత? ప్రభాతచంద్రుఁడు వెలవెలఁబోవుచుండును, వానిని మించుటలో ఉత్కర్ష యేమి కల దనవలదు, ఆవెలవెలయే యొకయొప్పు, అట్టిది మొగమున నొక సొంపు. మఙ్గళ మేవ మఙ్గళమాత్రమ్. ప్రాత ర్భవః ప్రాతస్తనః. ఉపమాస్వభావోక్తులు.

విదూ.—(ఉపసృత్య) స్వస్తి భవతే; వర్ధతాం భవాన్.

రాజా.—(విలోక్య) వసన్తక, కస్మాత్ ప్రహృష్ట ఇవ లక్ష్యసే?

[2] విదూ.—అర్చ్చతి ఖలు దేవీ బ్రాహ్మణమ్.

రాజా.—య ద్యేవం కిం తవ?

[3] విదూ.—(సగర్వమ్) భో ఈదృశః ఖలు బ్రాహ్మణః యః చతుర్వేద పఞ్చవేద షడ్వేద బ్రాహ్మణ సహస్ర పర్యాకులే రాజకులే ప్రథమ మేవ దేవీసకాశాత్ స్వస్తివాచనం లభతే.

రాజా.—(విహస్య) వేదసంఖ్యయై వావేదితం బ్రాహ్మణ్యమ్. త దాగచ్ఛ [4] మహాబ్రాహ్మణ, ధారాగృహోద్యాన మేవ గచ్ఛావః.

విదూ.—(దరిసి) శుభము నీకు; వర్ధిల్లుము నీవు.

రాజు.—(చూచి) వసంతకా, ఏల సంబరపడుచున్న ట్లగపడుచున్నావు?

విదూ.—పూజించును గదా దేవి బ్రాహ్మణుని.

రాజు.—అ టయిన నీ కేమి కలదు?

విదూ.—(గర్వముతో) ఓయి బ్రాహ్మణుఁ డనఁగా ఎవఁ డనుకొంటివి? నాలుగువేదముల యైదువేదముల యాఱువేదముల బ్రాహ్మణులు వేనవేలు మూఁగియున్న రాచనగర మొట్టమొదట రాణిగారివలననుండి ఎవఁడు స్వస్తివాచనము పొందునో వాఁడు బ్రాహ్మణుఁడు.

రాజు.—(నవ్వి) వేదసంఖ్యచేతనే నీబ్రాహ్మణ్యము తెల్ల మయినది. మఱి రమ్ము మహాబ్రాహ్మణుఁడా ధారాగృహోద్యానమునకే పోవుదము.

1. విదూ—...సొత్థి భవదో. వఢ్ఢదు భవం.

2. విదూ.—అచ్చది క్ఖు దేవీ బమ్హణం.

3. విదూ.—......ఈరిసో క్ఖు బమ్హణో జో చఉవ్వేద పంచవేద ఛట్ఠవేద బమ్హణ సహస్స పజ్జాఉలె రాఅఉలె పుఢమం ఎవ్వ దేవీసఆసాదో సొత్థివాఅణం లహేది.

4. మహాబ్రాహ్మణుఁడు—(1) బ్రాహ్మణోత్తముఁడు, (2) బ్రాహ్మణాధముఁడు, అని యీమాటకు రెం డర్థములు; రెండును ఇట నన్వితములే.

"పుణ్యో మహాబ్రహ్మసమూహజుష్టః సంతర్పణో నాకసదాం వరేణ్యః
జజ్వాలలోకస్థితయే స రాజా యథాధ్వరే వహ్ని రభిప్రణీతః." భట్టిః.

'శఙ్ఖే తైలే తథా మాంసే వైద్యే జ్యోతిషికే ద్విజే
యాత్రాయాం పథి నిద్రాయాం మహచ్ఛబ్దో న దీయతే,' భట్టి టీకా.

సఖీలే, కిం మాం లజ్జయసి ?

[కిఞ్చిత్పరాఙ్ముఖీ తిష్ఠతి.

విదూ.—(సవిషాదమ్) తిష్ఠన్తు తావ న్నళినీపత్త్రాణి. అతిలజ్జాళుకా తే ప్రియసఖీ. తత్కథ మేతయో స్సమాగమో భవిష్యతి?

[2] మనో.—(క్షణం విచిన్త్య సహర్షమ్) వసన్తక, ఏవ మివ.

[కర్ణే కథయతి.

విదూ. - సాధు మనోరమే, సాధు. (అపవార్య) యావ దేవ యూయం నేపథ్యగ్రహణం కురుథ తావ దే వాహ మపి ప్రియవయస్యం గృహీత్వా ఆగచ్ఛామి.

[3] మనో—అతికోపనే, ఉత్తిష్ఠోత్తిష్ఠ. న ర్తితవ్యం ఖ ల్వస్మాభి స్త

ము మానవు? ఏల నన్ను సిగ్గుపఱిచెదవు?

[ఇంచుక పెడమొగం బయి నిలుచును.

విదూ.—(విషాదముతో) తామరాకుల మాట అటుండనీ. నీనెచ్చెలి మిగుల సిగ్గరి. ఇటులున్న ఎట్లు వీరికి కూటమి ఘటిల్లును?

మనో.—(క్షణ మాలోచించి, సంతోషముతో) వసంతకుఁడా, ఇట్లుగా.

[చెవిలో చెప్పును.

విదూ.—బళీ! మనోరమా, బళి! (అపవారించి) మీరు పోయి వేషము దాల్చునప్పటికే నేనును ప్రియవయస్యుని తోడ్కొని వచ్చెదను.

మనో.—ఎంతకోపమే, లేవే లేవే. ఆనాటకములోనే ఆడవలసిన మిగతను

1. విషాదము ఉపాయముతోఁపమి. రాజునకు ఆతామరాకులు ఆరణ్యకను వసంతకుఁడు కనిపట్టని పక్షమున మాత్రమే వలయును గావున వసంతకుఁడు వానిని గయికొనమి.

2. హర్షము మంచియుపాయము తోఁచినందులకు.

3. కుప్యతి తచ్ఛీలా = కోపనా = కోపశీల.

ఆర. ...అఇ పరిహాససీళే కిం మం లజ్జావేసి?

విదూ.—...చిట్ఠంతు దావ ణళిణీపత్తాఇం. అదిలజ్జాళుఆ దె పిఅసహీ; తా కహం ఏదాణం సమాఅమో హివిస్సది?

మనో.—...వసంతఅ ఎవ్వం విఅ.

విదూ.—సాహు పిఅసహి సాహు...జావ ఎవ్వ తుమ్హె ణేవచ్ఛగ్గహణం కరేథ, అహం వి పిఅవఅస్సం గెణ్హిఅ ఆఅచ్ఛామి.

వైస్యైవ నాటకస్య న ర్తితవ్య శేషమ్. త దేహి ప్రేక్షాగృహ మేవ గచ్ఛావః. (ప్రవిష్టకే నావలోక్య) సా థ్యేత త్సజ్జీకృతమ్; తద్దేవ్యా ఆగ న్తవ్యమ్.

(తతః ప్రవిశతి దేవీ సాంకృత్యాయనీ విభవత శ్చ పరివారః.)

వాస.—భగవతి, అహో తే కవిత్వమ్! యే నైతం వృత్తాన్తం నాటకోపనిబద్ధం స్వానుభవ మప్యస్మాక మార్యపుత్ర చరిత మదృష్ట పూర్వ మివ దృశ్యమానం కౌతూహలం వర్ధయతి.

సాంకృ.—ఆయుష్మతి, ఆశ్రయగుణ[1] ఏ వాయ మీదృశః య దసార మపి కావ్యం శృణ్వతాం శ్రవణసుఖ ముత్పాదయతి. పశ్య,-

ప్రాయో య త్కిఞ్చి దపి ప్రాప్నో త్యుత్కర్ష మాశ్రయా న్మహతః

మనము ఆడవలయుఁగదా. రా మతి నాటకశాలకే పోదము. (నడచి, చూచి) ఇదె నాటకశాల. రా ప్రవేశింతము. (ప్రవేశాభినయముతో చూచి)-చక్కఁగా ఇది సిద్ధముచేయఁబడినది; కనుక దేవి వచ్చుసమయము.

(అంతట దేవియు సాంకృత్యాయనియు విభవంబుగా పరివారంబును ప్రవేశింతురు.)

వాస.—భగవతీ, అహో (ఎంతవింతగా నున్నది) నీకవనము! ఎట్లన, ఈకవనముచే ఈవృత్తాంతము మాయార్యపుత్త్రుని చరిత్రము నాటకముగా అల్లఁబడినట్టిది స్వానుభూతమే అయినను చూచునప్పుడు మున్నెన్నఁడును చూడనిదివోలె కుతూహలమును పెంచుచున్నది.

సాంకృ.—ఆయుష్మతీ, నీరసకావ్యము సయితము వినువారివీనులకు విం దొనర్చుట ఆశ్రయప్రభావము గాని యొండుగాదు. కనుము,-

నికృష్టవస్తువు సైతము తలుచుగా ఉత్కృష్టవస్తువుయొక్క యాలంబనముచేత ఉత్కర్షను పొందును; బూడిద మదపు టే

1. ఆశ్రయ గుణః—ఆలంబనముయొక్క (అనఁగా కథానాయకునియొక్క, ఇట, వత్సరాజుయొక్క) ప్రభావము.

మనో.—అదికోవణే, ఉక్ఖేహి ఉక్ఖేహి. ణచ్చిదవ్వం క్ఖు అమ్హేహిం తస్స ఎవ్వ ణాడఅస్స ణచ్చిదవ్వసేసం. తా ఏహి పెక్ఖాఘరం ఎవ్వ గచ్ఛమ్హ...ఎదం పెక్ఖాఘరం, జావ ఏహి పవిసమ్హ...సాహు ఏదం సజ్జీకిదం; దేవీఏ ఆఅంతవ్వం.

వాస.—భఅవది, అహో దే కవిత్తణం! జేణ ఏదం వుత్తంతం ణాడఓవణిబద్ధం సాణుహావం వి అమ్హాణం అయ్యవుత్తచరిదం అదిట్ఠపువ్వం విఅ దీసంతం అహిఅదరం కోదూహళం వడ్ఢావేది!

మత్తేభకుమ్భతటగత
మేతి హి శృఙ్గారతాం భస్మ.

[1] వాస.—(సస్మితమ్) భగవతి, సర్వస్య వల్లభో జామాతేతి జ్ఞాయత ఏవ. కి మనేన కథానుబన్ధేన? వర మేవ తన్నృత్యం ద్రష్టుమ్.

[2] సాంకృ.—ఏవమ్. ఇన్దీవరికే, ప్రేక్షాగృహమార్గ మాదేశయ.

చేటీ.—ఏ త్వేతు భట్టినీ.

[సర్వాః పరిక్రామన్తి.

నుఁగుకుంభస్థలమం దున్నదై అలంకారత్వమును చెందునుగదా.

వాస.—(చిఱునగవుతో) భగవతీ, తెలియుచునే యున్నది అల్లుఁడు ఎల్లవారికిని వల్లభుఁడని. ఏల యీప్రస్తావమును పెంచుట? ఆనాట్యమును చూచుటయే మేలు.

సాంకృ.—అవును. ఇందీవరికా, నాటకశాలకు దారి చూపుము.

చేటీ.—రమ్ము రమ్ము దేవీ.

[స్త్రీ లందఱు నడతురు.

ప్రాయః = తఱుచుగా, యత్ కిఞ్చిత్ అపి = ఏనికృష్టవస్తువైనను, మహతః ఆశ్రయాత్ = ఉత్కృష్టవస్తువుయొక్క ఆలంబనముచేత (ఉత్కృష్టవస్తువును ఆశ్రయించుటచేత), ఉత్కర్షం ప్రాప్నోతి = ఉత్కర్షను పొందును; హి = అదియెట్లనఁగా, భస్మ మత్త ఇభ కుమ్భ తట గతం (సత్) శృఙ్గారతాం యాతి = బూడిద మదపు ఏనుఁగుయొక్క కుంభ స్థలమును పొందినది (అయి) గజాలంకారత్వమును పొందును. * 'శృఙ్గారో గజమణ్డనే సురతే రసభేదే చ' ఇతి హైమః. పనికిరాని బూడిద ఏనుఁగుకుంభస్థలము నాశ్రయించుటచేత ఏవిధముగా అలంకార మయినదో ఆవిధముగానే నానీరసకావ్యము వత్సరాజుంగూర్చి రచించిన దగుటచేత గణనీయ మైనది. * అర్థాంతరన్యాసాలంకారము, 'ఉక్తి రర్థాన్తరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః.' ఉత్కృష్టుని వత్సరాజు నాశ్రయించినందున స్వకావ్యము ఉత్కర్షం జెందినది - అని ప్రస్తుతము గమ్యమగునట్లుగా అప్రస్తుతమును చెప్పినందున * అప్రస్తుతప్రశంసాలంకారము, 'అప్రస్తుతప్రశంసా స్యాత్సా యత్ర ప్రస్తుతాశ్రయా.'

1. జామాతా—అల్లుఁడు, ఇట వత్సరాజు; సాంకృత్యాయనియందు మాతృగౌరవ ముంచి వాసవదత్త చెప్పుట.

2. దారి చూపు మనుటలో, దేవికి దారిచూపు మని, తాత్పర్యము.

వాస.—...భఅవది సవ్వస్స వల్లహో జామాదొత్తి జాణీ అది ఎవ్వ. కిం ఏదిణా. కహాణుబంధేణ? వరం ఎవ్వ తం ణచ్చిదం దట్ఠుం.

చేటీ.—ఏదు ఏదు భట్టిణీ.

సాంకృ.—(ఆలోక్య) అహ్హో ప్రేక్షణీయతా ప్రేక్షాగృహస్య?

8 ఆభాతి 1 రత్న శత శోభిత శాతకుమ్భ
స్తమ్భావసక్త పృథు మౌక్తిక దా మ రమ్యమ్
4 అధ్యాసితం 3 యువతిభి 2 ర్విజితాప్సరోభిః
6 ప్రేక్షాగృహం 7 సురవిమాన సమాన 5 మేతత్.

(చూచి) అహహో నాటకశాల యెంత కన్నులపండువుగా నున్నది!

౧ రత్నముల వందలచేత వెలుఁగొందిన బంగారుకంబములందు కట్టఁబడిన పెద్ద ముత్తె సరములచే గమణీయంబును ౨ అ చ్ఛగలఁగెలిచిన 3 గుబ్బెతలచేత ౪ అధిష్ఠితంబును అగు ౫ నీ ౬ నాటకశాల ౭ దేవతల యాకాశయానమునకు తుల్యముగా ౮ ప్రకాశించుచున్నది.

మనో. ఆర.—(ఉపసృత్య) జ జయతు దేవీ.

మనో. ఆర.—(సమీపించి) జయము జయము దేవికి.

వాస.—అతిక్రాన్తా ఖలు సంధ్యా. త ద్గచ్ఛథ, లఘు గృహీత నైపథ్యమ్.

వాస.—సంజ దాఁటిపోయినది. మఱి పొండి, త్వరగా వేషము వేసికొండి.

ఉభే.—య దాజ్ఞాపయతి భట్టినీ. [ఇతి ప్రస్థితే.

ఇరువురు.—దేవియాజ్ఞ [అని యిరువురును తరలుదురు.

వాస.—ఆరణ్యికే, ఏతై రేవ మదజ్గపినద్ధై రాభరణై ర్నేపథ్య

వాస.—ఆరణ్యికా, వీనితోనే నా యొడలఁ దాల్పఁబడినయాభరణములతో

2. అద్భుత్యః సరస్త్రీ త్యప్సరసః, 'స్త్రియాం బహు ష్వప్సరసః స్యాదేక త్వేఽప్సరా అపి.' * ఉపమాలంకారము; విజిత—ఉపమావాచకము, 'స్పర్ధతె జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి' ఇత్యాదులు దండ్యాచార్యులచే ఉపమావాచకములుగా పఠింపఁబడినవి. * ఉదాత్తాలంకారంబును, 'ఉదాత్త మృద్ధే శ్చరితమ్.'

మనోరమారణ్యికే.—జేదు జేదు భట్టిణీ.

వాస.—అదిక్కంతా క్ఖు సంఝా; తా గచ్ఛహ లఘు గెణ్హిాధ ణేవచ్ఛం.

ఉభే.—జం ఆణవేది భట్టిణీ.

భూమిం గత్వా ఆత్మానం ప్రసా
ధయ. (ఆభరణా న్యఙ్గా దవతా ర్యా
ర్పయిత్వా) మనోరమె, త్వ మపి
1 నలగిరిగ్రహణ పరితుష్టేన తాతె
న ఆర్యపుత్త్రాయ దత్తా న్యాభర
ణాని ఇన్దీవరికాసకాశాద్గృహీత్వా,
నేపథ్యభూమిం గత్వా ఆత్మానం
మణ్డయ, యేన సుసదృశీ దృశ్యసే
మహారాజస్య.

నేపథ్యగృహమునకుం బోయి నిన్ను అలంక
రించుకొమ్ము. (ఆభరణములను ఒడలినుండి
తీసి యిచ్చి) మనోరమా, నీవును మానా
యన ఆర్యపుత్త్రునికి నలగిరిని పట్టినందులకు
మెచ్చి యిచ్చిన యాభరణములను ఇందీవ
రిక యొద్దనుండి కైకొని నేపథ్యగృహమున
కుం బోయి ని న్నలంకరించుకొమ్ము, అట్లు
చేసిన మహారాజును కేవలము సరి పోలు
దువు.

[మనో. ఇన్దీవరికాసకాశా దాభరణాని
గృహీత్వా సహారణ్యకయా నిష్క్రాన్తా.

ఇన్దీ.—ఇద మాసన ముపవిశ
తు భట్టినీ.

2 వాస.—(ఆసనం నిర్దిశ్య) ఉప

[మనో. ఇందీవరికయొద్దనుండి నగలం
గైకొని ఆరణ్యకతో నిష్క్రమించును.

ఇన్దీ.—ఇదిగో ఆసనము, దేవి కూర్చుం
డవచ్చును.

వాస.—(ఆసనముం జూపి) భగవతి

1. నలగిరి యను నేనుఁగువృత్తాంతము పీఠికలో ప్రస్తావింపఁబడియున్నది. అది యొకతఱిని మదమెక్కి కంబమును బెకలించి దుముకులాడుచుం ద్రిమ్మరం జొచ్చినట్లు మేఘసందేశమువలనం దెలియుచున్నది. అప్పుడు దానిని వత్సరాజు పట్టినట్లు ఈ కథవలన నిటం దెలియుచున్నది.

"ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజో౽త్ర జహ్రే,
హైమం తాళద్రుమవన మభూ దత్ర తస్యైవ రాజ్ఞః,
అత్రోద్భ్రాన్తః కిల నలగిరిః స్తమ్భ ముత్పాట్య దర్పా,
ది త్యాగన్తూ న్రమయతి జనో యత్ర బన్ధూ నభిజ్ఞః." మేఘః.

2. నిర్దిశ్య - చూపుట భగవతికి. ఉపవిశతు అనుట భగవతిని.

వాస.—అరణ్ణిఏ ఏదేహిం ఎవ్వ మదంగపిణద్ధేహిం ఆహరణేహిం ణేవచ్ఛభూమిం గదుఅ అప్పాణం పసాధేహి.... మణోరమే, తుమం పి ణళగిరిగ్గహణపరితుట్ఠేణ తాదేణ అయ్యఉత్తస్స దిణ్ణాఇం ఆభరణాఇం ఇందీవరిఆసఆసాదో గేణ్హిఅ, ణేవచ్ఛభూమిం గదుఅ, అప్పాణం మండేహి, జేణ సుసరిసీ దీససి మహారాఅస్స.

ఇన్దీ.—ఇదం ఆసణం ఉవవిసదు భట్టిణీ.

విశతు చ భగవతీ.

[ఉభే ఆసనగ్రహణం నాటయతః.

[1] (తతః ప్రవిశతి గృహీతనేపథ్యః కఞ్చుకీ.)

కఞ్చుకీ.—

[2] అన్తఃపురాణాం విహితవ్యవస్థః పదే పదే ఽహం స్ఖలితాని రక్షన్ జరాతురః సంప్రతి దణ్డనీత్యా సర్వం నృపస్యానుకరోమి వృత్తమ్.

యును కూర్చుండవలయును.

[ఇరువురును కూర్చుండుట నభినయింతురు.

(అంత వేసముదాల్చిన కంచుకి ప్రవేశించును.)

కంచు. —రాణివాసములకు ఏర్పాటులు సేయుచు, అడుగడుగునను తడఁబాటు తప్పించుకొనుచు, ముదిమిచే దుర్బలుఁడనై యిపుడు, కఱ్ఱ యూనుకొని నడచుచు, నేను, పట్టణములయందు ఏర్పాటులు సేయువాఁడును, ఒక్కొక్క యధికారమందునుగలుగు పొరఁబాట్లను తొలఁగించువాఁడును, అర్థశాస్త్రము ప్రయోగించువాఁడును, అగు రాజుయొక్క సమస్తచర్యను అనుకరించుచున్నాను.

వాస.—...ఉవవిసదు అ భఅవదీ.

**1.** ఇదె నాటకశేషప్రయోగారంభము. ఒకతె కంచుకివేసము వేసికొని వచ్చిన దనుట. ఈకంచుకి ఉజ్జయినిలో ప్రద్యోతునియంతఃపురమువాఁడు. ఇట కథాస్థలము ఉజ్జయినిలో రాజమందిరము.

**2.** అన్తఃపురాణామ్ = రాణివాసములకు (పురాణామ్ అన్తః = పట్టణముల లోపల అని రాజపరము), విహిత వ్యవస్థః = చేయఁబడిన యేర్పాట్లుగలవాఁడనై, పదే పదే సంస్ఖలితాని రక్షన్=అడుగడుగునను తడఁబాటులను తప్పించుకొనుచు (ఒక్కొక్కయధికారమందును పొరఁబాట్లను తప్పించుచు అని రాజపరము), జరా ఆతురః = ముదిమిచేత దుర్బలుఁడనై, సంప్రతి = ఇప్పుడు, దణ్డ నీత్యా = కఱ్ఱయొక్క నడుపుటచేత (కఱ్ఱ యూనుకొని నడుచుచు) (అర్థశాస్త్రముచేత- అర్థశాస్త్రప్రయోగముచేత అని రాజపరము), నృపస్య సర్వం వృత్తమ్ అనుకరోమి = రాజుయొక్క సమస్త వ్యాపారమును అనుకరించుచున్నాను. పదే పదే—రాజపరముగా - అమాత్యులు సేనాపతులు, కోశాధ్యక్షులు, మునసబులు, అమల్దారులు, కొత్వాలులు, లోనగు నుద్యోగస్థలయందు అనుట. దండనీతి = రాజు ఎట్లు నడచుకోవలయునో ఆపద్ధతిని చెప్పునట్టి శాస్త్రము; దానికే రాజనీతి, అర్థశాస్త్రము, అని నామాంతరములు.

'దమో దణ్డ ఇతి ఖ్యాత, స్తాస్థ్యాద్దణ్డో మహీపతిః,
తస్య నీతి ర్దణ్డనీతి, ర్నయనా న్నీతి రుచ్యతే.' కామన్దకీ.

* ఉపమాలంకారము.

ఆజ్ఞాపితోఽస్మి విమానితాశేషశత్రుసైన్యేన యథార్థనామ్నా [1] మహాసేనేన—"సమాదిశ్యతా మన్తఃపురేషు, యథా 'శ్వో వయం [2] మదనోత్సవ మనుభవావః; అతో యుష్మాభి రుత్సవానురూప వేషోజ్జ్వలేన పరిజనేన సహ మన్మథోద్యానం గన్తవ్య మి' తి."

శత్రువుల నెల్ల ఓడించినదండుగలవాఁడై అన్వర్థనామధేయుఁడైన మహాసేనునిచే 'రేపు మేము మదనోత్సవ మనుభవించెదము, అందులకు ఉత్సవమునకుం దగినవేషముచే వెలుఁగొందెడి పరిజనముతోఁ గూడ మీరు మన్మథోద్యానమునకు రావలసినది' అని, రాణివాసములకు తెలుపుడు సేయుమని నేను ఆజ్ఞాపింపఁబడితిని.

[3] సాంకృ.—(కఞ్చుకినం నిర్దిశ్య) ప్రవృత్తా ప్రేక్షా; దృశ్యతామ్.

సాంకృ.—(కంచుకిని చూపి) ఆట ఆరంభమయినది; చూడుము.

కఞ్చు.—త దేతావ దాదేష్టవ్యం పరిజనేన సహ గన్తవ్య మితి, న వేషోజ్జ్వలే నేతి. కుతః—

కంచు.—అయినను, పరిజనముతో రావలసినది అని తెల్పినం జాలును, 'వేషముచే వెలుఁగొందెడి' యన నక్కఱలేదు. ఏలన:

[4]పాదై ర్నూపురిభి, ర్నితమ్బఫలకై
శ్శిఞ్జానకాఞ్చీగుణైః,
హారాపాదితకాన్తిభిః స్తనతటైః,
కేయూరిభి ర్బాహుభిః,

ఇచట దేవేరుల యూడిగంపుఁజేడియలు సయితము, పాదములందు అందియలు, విశాలమయిన పిఱుందుపై మ్రోఁగుచున్న మొలనూలును, చనుగట్టులపై వెలుఁగులు చ

1. కథాసరిత్సాగరమున వాసవదత్తా జనకునికి తొలుత మహాసేనుఁ డని పేరు, అనంతరము తత్కృతచండోపాసనచే చండమహాసేనుఁ డని మాఱినది. మహతీ సేనా యస్య సః - మహాసేనః.

2. 'ఉదయనోత్సవమ్' అనికొన్ని ప్రతులందున్నది. ఆపాఠమునకు ఉదయనుని (వత్సరాజును) ఖయిదు విడిపించుటకై సంకల్పితమయిన యుత్సవము అనియర్థము.

3. సాంకృత్యాయని ఆట చూడు మని వాసవదత్తను హెచ్చరించుచున్నది.

4. అత్ర దేవీనామ్ ఏవ పరిచారికా పరిజనః అపి = ఇచట దేవేరులయొక్క యీ యూడిగంపుఁ బరివారము సైతము, నూపురిభిః పాదైః = అందెలుగల పాదములతోను, శిఞ్జాన కాఞ్చీ గుణైః నితమ్బ ఫలకైః = మొరయుచున్న మొల త్రాడుగల పిఱుఁదు బల్లలతోను, హార ఆపాదిత కాన్తిభిః స్తన తటైః = ముత్తెపుఁజేరులచే ఒసఁగఁ

కర్ణైః కుణ్డలిభిః కరైః సవలయైః,
సస్వస్తికై ర్మూర్ధజై,
ర్దేవీనాం పరిచారికాపరిజనోఽ
ప్యేషోఽత్ర సందృశ్యతే.

న ఖలు కిఞ్చిద త్రాపూర్వ మనుష్ఠేయమ్. కేవలం స్వామ్యాదేశ ఇతి మ త్వాహం సమాదిష్టం తదాజ్ఞాశేషం [1] రాజపుత్ర్యై నివేదయామి. (ఇతి పరిక్ర మ్యావలోక్య చ) ఇయం వాసవదత్తా వీణాహస్తయా కాఞ్చనమాలయాఽనుగమ్యమానా [2] గాన్ధర్వశాలాం ప్రవిష్టా. యావ దస్యాః కథయామి.

[ఇతి పరిక్రామతి.

(తతః ప్రవిశతి గృహీతవాసవదత్తానైపథ్యా ఆసనస్థా ఆరణ్యికా, వీణాహస్తా కాఞ్చనమాలా చ.)

ఆర.—హఞ్జే కాఞ్చనమాలే,

ల్లును త్తైపుఁబేరులును, బుజములందు అంగదములును, వీనులయందు కమ్మలును, చేతులందు కడియములును, తలకట్టునందు స్వస్తికంబును, దాల్చినవార్లై అగపడుచున్నారు.

ఇటచేయవలసినది అపూర్వము ఏమియు లేదు. కేవలము ప్రభువునానతి యని తలఁచి నేను నియమింపఁబడినయాయాజ్ఞాశేషమును రాజకుమారి కెఱుక చేసెదను. (అని నడచి, చూచి యు) కేల వీణియం గొని కాంచనమాల వెంట రా ఇదిగో వాసవదత్త సంగీతశాలం జొచ్చినది. ఈమెతో చెప్పెదను.

[అని నడచును.

(అంత వాసవదత్తవేషము దాల్చి ఆసనమందు గూర్చున్నదిగా ఆరణ్యికయు వీణం గేలఁ గొని కాంచనమాలయు ప్రవే.)

ఆర.—ఓసి, కాంచనమాలా, ఏల మతి

బడిన శోభగలవైన చను గట్టులతోను, కేయూరిభిః బాహుభిః = అంగదములుగల భుజములతోను, కుణ్డలిభిః కర్ణైః = కమ్మలుగల చెవులతోను, సవలయైః కరైః = కడియములతోడి చేతులతోను, సస్వస్తికైః మూర్ధజైః = స్వస్తిక మను పేరియాభరణముతోడి తలవెంట్రుకలతోను, సంలక్ష్యతే = అగపడుచున్నది. దేవీనామ్ - వాసవదత్తాజనని యగు నంగారవతి లోనగువారు చండమహాసేనుని దేవేరులు. అపి శబ్దముచే, ఊడిగంపుఁజేడియలే ఇంత విభవముగా నలంకరించికొనఁగా ఇఁక అంతకన్న నెచ్చువారగు దేవేరులును ఎట్టియుజ్జ్వలనైపథ్యము దాల్తురో చెప్పవలయునా అని * కావ్యార్థాపత్త్యలంకారధ్వని.

1. రాజపుత్త్ర్యై - వాసవదత్తకు.
2. గన్ధర్వాణా మిదం గాన్ధర్వం సంగీతశాస్త్రమ్.

కస్మాత్ పునశ్చిరయ త్యద్య వీణాచార్యః ? — విలంబించుచున్నాఁడు నేఁడు వీణాగురువు?

కాఞ్చు — భర్తృదారికే, దృష్టస్తేనైక ఉన్మత్తః, తస్య వచనం శ్రుత్వా [1] చిత్రేణ భావితః సాసక్తి తిష్ఠతి. — కాంచ.—భర్తృదారికా, ఆయన యొక వెఱ్ఱివానిని చూచినాఁడు, వానిమాట విని వింతపడి నవ్వుచు ఉన్నాఁడు.

ఆర.—(సహస్తతాళలం విహస్య) హాఞ్జె, సుష్ఠ్వేత ద్భణ్యతే 'సదృశా స్సదృశేషు రజ్యన్తే' ఇతి. ద్వావప్యత్రోన్మత్తౌ. — ఆర.—(చప్పట్లు చఱచుచు, నవ్వి) ఓసీ, ఒప్పుగా చెప్పఁబడినది 'సమానులు సమానులయందు అనురక్తులగుదురు' అను నిది. ఇరువురును ఇట ఉన్మత్తులు.

సాంకృ — రాజపుత్ర్యాః [3] సదృశమాకారం పశ్యామ్యస్యాః; తాదృశే నాకారే ణావశ్యం [4] త్వదీయాంభూమికాం సంభావయిష్యతి. — సాంకృ.—రాకుమారీ, నీపోలికగా ఈ మెయాకారము నా కగపడుచున్నది. అట్టి యాకారముతో తప్పకుండ నీవేషమును చక్కఁగా నెఱవేర్చును.

కఞ్చు.-(ఉపసృత్య) రాజపుత్రి, — కంచు.—(సమీపించి) రాజపుత్త్రి, ఏలి

1. ఈయున్మత్తుఁడు వసంతకుఁడు. వెఱ్ఱివేషమున బంధనగతునికి వత్సరాజునకు యౌగంధరాయణ విరచిత మయినవాసవదత్తాహరణపూర్వక నిజదేశగమనోపాయమును నివేదింప వచ్చినవాఁడు. అతఁడు తెలిపినవింత పన్నాగమునకు వత్సరాజు ఆశ్చర్యపడుచుండెను; దానిని ఉన్మత్త వేషభాషా చేష్టలకు వింత పడుటగా ఆవక్త్రి వచించినది.

2. రాజు ఉన్మత్తుఁ డనుటలో కామోన్మత్తుఁ డని గూఢభావము.

3. నీపోలిక నున్నదిగావున, వేషములో నీవే అనిపించు నని భా.

4. ప్రియదర్శిక వాసవదత్తకు పినతల్లికూఁతురు గావున ఈపోలిక. తనపినతల్లికూఁతురని వాసవదత్త యెఱుఁగదు.

ఆర.—హంజే కంచణమాలే, కీస ఉణ చిరాయది అజ్జ వీణాఆరిఓ?

కాఞ్చు.—భట్టిదారిఏ, దిట్ఠో తేణ ఎక్కో ఉమ్మత్తో; తస్సవఅణం సుణిఅ చిత్తేణ భావిదో హసంతో చిట్ఠఇ.

ఆర.—...హంజే సుట్ఠు ఏదం భణీఅది-'సరిసా సరిసేసు రజ్జంతి' త్తి. దువేవి ఎత్థ ఉమ్మత్తా.

దేవ స్త్వా మాజ్ఞాపయతి 'శ్వో ఽవ శ్య మస్మాభి ర్వీణాం వాదయ న్తీ శ్రో తవ్యా; త త్త్వయా నవత న్త్రీసజ్జ యా [1]'ఘోషవత్యా స్థేయ మి' తి.

నవారు నిన్ను ఆజ్ఞాపించినారు 'రేపు తప్పక మేము నీవీణావాదనమును వినవలయును. అందుకై నీవు క్రొత్తదిగ తంతులు కట్టిన ఘోష వతిని కొనిరావలయును' అని.

ఆర.—ఆర్యే, య ద్యేవం లఘు [2] వీణాచార్యం విసర్జయ.

ఆర.—అయ్యా, అ ట్లైని వెంటనే వీణా గురువును పంపు.

కఞ్చు.—ఏష వత్సరాజం ప్రేష యామి. [ఇతి నిష్క్రాన్తః.

కంచు—ఇదే వత్సరాజును పంపెదను' [అని నిష్క్రమించును.

ఆర.—కాఞ్చనమాలే, ఉపన య మే ఘోషవతీమ్,యావ దస్యా స్తన్త్రీః పరీక్షే.

ఆర.—కాఞ్చనమాలా, నా (చేతి) కిమ్ము ఘోషవతిని, దానితంతులను పరీక్షించెదను.

[కాఞ్చ.—వీణా మర్పయతి. ఆర.—ఉ త్సఙ్గే వీణాం కృత్వా [3]సారయతి.

[కాంచ.— వీణ నిచ్చును. ఆర.— వీణను ఒడిలోపెట్టుకొని తంతులను తుడుచును.

(తతః ప్రవిశతి గృహీతవత్సరాజనే పథ్యా మనోరమా.)

(అంతట వత్సరాజువేసముదాల్చినదై మనోరమ ప్రవేశించును.)

మనో.—(స్వగతమ్) చిరయతి మహారాజః. కిం న కథితం వస న్తకేన? అథవా దేవ్యా బిభేతి? య దీదానీ మాగచ్ఛే త్తదా రమణీ యం భవేత్.

మనో.—(స్వగతము) తామసించుచు న్నాఁడు మహారాజు. చెప్పలేదేమో వసం తకుఁడు? ఒండె, (ప్రభువు) దేవికి వెఱచు చున్నాఁడా? ఇప్పుడు వచ్చునేని బాగు గా నుండును.

1. ఘోషవతి యని వత్సరాజువీణను పేరు, వీణామాత్రమునకును పేరు.
2. వీణాచార్యుఁడు వత్సరాజు.
3. సారయతి—'తన్త్రీ మార్గాన్ నయనసలిలై స్సారయిత్వా కథఞ్చిత్' మేఘసం.

ఆర.—అయ్య జఇ ఎవ్వం లహు వీణాఆరిఅం విసజ్జేహి.

ఆర.—కంచణమాలే, ఉవణేహి మే ఘోసవదిం, జావ సే తందీఓ పరిక్ఖేమి.

మనో.—...చిరఅది మహారాఓ. కిం ణ కహిదం వసంతఏణ? అహవా దేవీఏ భాఅది? జఇ దాణిం ఆఅచ్ఛే తదో రమణిజ్జం భవే.

(తతః ప్రవిశతి రాజా, అవగుణ్ఠితశరీరో విదూషకశ్చ.)

రాజా.—

సంతాపం ప్రథమం తథా న కురుతే
శీతాంశురద్యైవ మే,
నిశ్వాసా గ్లపయన్త్యజస్రమధునై
వోష్ణా స్తథా నాధరమ్;
సంప్రత్యేవ మనో న శూన్యమలసా
న్యఙ్గాని నో పూర్వవత్
దుఃఖం యాతి మనోరథేషు తను
తాం సంచిన్త్యమానే ష్వపి.

వయస్య, సత్యమేవోక్తం మ నోరమయా,యథా, "ఏషా మమ ప్రియసఖీ మహారాజస్య దేవ్యా దర్శనపథా దపి రక్ష్యతే, తదయం సమాగమోపాయః: అద్య రాత్రావ స్మాభి రుదయనచరితం నామ నాటకం దేవ్యాః పురతో న ర్తితవ్యమ్,

(అంతట రాజును, బురకా వేసికొని విదూషకుఁడును, ప్రవేశింతురు.)

రాజు.—నాకు చంద్రుఁడు ఇప్పటివలెను కాఁక పెట్టుచున్నవాఁడు అట్లు పెట్టుటను ఇపుడే తొలిమాఱు మానినాఁడు. ఇప్పటివలెను వేఁడులై తెంపులేకుండ పెదవిని వాడించుచుండిన యూర్పులు అట్లు చేయుటను ఇప్పుడే మానినవి. ఇంతవఱకు మనస్సునందుండినశూన్యత యిప్పుడే వదలినది. ఇంతవఱకు అంగములందున్నయలసత యిప్పుడే పోయినది. కోరికలను తలపోసికొనుమాత్రానే దుఃఖము సన్నగిల్లుచున్నది.

వయస్యా, నిజమేనా మనోరమ మాట? ఏమనఁగా—"ఇదె ఈనా నెచ్చెలిని మహారాజుకంటిదారిలో నేనియు పడనీయక దేవి కాచుచున్నది. దానంజేసి యిది సమాగమోపాయము: ఈ రాత్రి మేము ఉదయనచరిత మను నాటకమును దేవిముందల నాడ వలసియున్నది, అందు ఆరణ్యక వాసవదత్తయగును, నేనును వత్సరాజ

మే శీతాంశుః తథా సంతాపం అద్యైవ ప్రథమం న కురుతే = నాకు చలివెలుఁగు (చంద్రుఁడు) మునుపటివలె (= మునుపు కాఁక చేసినవిధమున) కాఁక (చేయుట) ను ఇప్పుడే తొలిమాఱు మానినాఁడు, ఉష్ణాః నిశ్వాసాః తథా అధునైవ అజస్రం అధరం న గ్లపయన్తి = వేఁడి యూర్పులు మునుపటివలె (మునుపు సంతతము వాడించినట్లు) ఇప్పుడే సతతముగా పెదవిని వాడింపవు, సంప్రత్యేవ మనః శూన్యం న = ఇప్పుడే మనస్సు శూన్యత మానినది, అఙ్గాని పూర్వవత్ అలసాని నో = అవయములు మునుపటివలె (మునుపు అలసములైనట్లు) (ఇప్పుడే) అలసములుగావు, మనోరథేషు సంచిన్త్యమానేషు అపి దుఃఖం తనుతాం యాతి = కోరికలను తలపోయుచున్న మాత్రానే దుఃఖము సన్నగిల్లును (అవి తీఱనే తీఱినచో దుఃఖము ఏమయిపోవునో అని భా.)

* అర్థాంతరన్యాసాలంకారము, * కావ్యార్థాపత్త్యలంకారధ్వనియు.

త త్రారణ్యకా వాసవదత్తా భవి ష్యతి, అహ మపి వత్సరాజః, త చ్చరితె నైవ సర్వం శిక్షితవ్యమ్. త దాగత్య స్వయ మేవ స్వాం భూ మికాం కుర్వాణః సమాగమోత్స వ మనుభవతు.'' ఇతి?

విదూ.—యది మాం న ప్ర త్యేషి, ఏషా మనోరమా తవ వే షం ధారయన్తీ తిష్ఠతి, త దుపస ర్ప్య స్వయ మేవ పృచ్ఛ.

రాజా.—(మనోరమా ముపసృత్య) మనోరమె, సత్య మిదం యద్వ సన్తకోఽభిధత్తె?

మనో.—భర్తః, సత్యమ్; మ ణ్డయ ఏతై రాభరణై రాత్మానమ్.

[ఇ త్యాభరణా న్యఙ్గాదవతార్య సమ ర్పయతి. రాజా పరిదధాతి.

విదూ.-ఏతే ఖలు రాజానః దా స్యా ప్యేవం నర్త్యన్తే! అహో! కార్యస్య గురుకతా!

రాజా.—(విహస్య) మూర్ఖ, నై ష కాలః పరిహాసస్య. నిభృతేన

నయ్యెదను; అతని చరిత్రమును బట్టియే సర్వ మును నేర్వవలెను; కావున ఆయన తా నే వచ్చి తన వేషమును నెఱవేర్చి సమాగ మోత్సవము ననుభవించుఁగావుత,'' అని?

విదూ.—నామాటయందు నమ్మకము లేదేని, ఇదె మనోరమ నీ వేషము దాల్చి యున్నది, దగ్గఱకు పోయి నీవే అడుగు?

రాజు.—(మనోరమకడకుం జని) మ నోరమా, నిజమే వసంతకుఁడు చెప్పునది?

మనో.—దేవా, నిజము. ఈ తొడవుల తో దేహమును అలంకరించుకొమ్ము.

[అని నగలను (తన) మెడలినుండి తీసి యిచ్చును. రాజు ధరించును.

విదూ.—ఈ రాజులు దాసిచేత సయి ము ఇట్లు ఆడింపఁ బడుచున్నారు! అహా! కార్యగౌరవము!

రాజు.—(నవ్వి) మూర్ఖుఁడా, ఇది కాదోయి సమయము ఎగతాళికి. రహస్య

విదూ.—జఇ మం ణ ప త్తిఆఅసి, ఏసా మణోరమా తుహ వేసం ధారఅంతీ చిట్ఠ ఇ, తా ఉపసప్పిఅ సఅం ఎవ్వ పుచ్ఛ.

మనో.—భట్టా సచ్చం. మండఅ ఏదేహిం ఆహరణేహిం అప్పాణం....

విదూ.—ఏదే క్ఖు రాఆణో దాసీఏ వి ఎవ్వం ణచ్చంతి! అహో కజ్జస్స గురుఅదా!

చిత్రశాలాం ప్రవిశ్య మనోరమయా సహాస్మన్నృత్తం పశ్యతా స్థీయతామ్.

ముగా చిత్రశాలకుఁ బోయి మనోరమతోఁ గూడ మాయాటను చూచుచు నుండుము.

[విదూ.—అట్లు చేయును.

[విదూ.—తథా కరోతి.

ఆర.—కాఞ్చనమాలే, తిష్ఠతు వీణా, ప్రక్ష్యామి తావత్కిమపి.

ఆర.—కాంచనమాలా, వీణను ఉండనీ, ఒకానొకటి యడిగెదను.

రాజా.—శృణోమి తావత్, కతమోఽయ ముద్దేశో వర్తత ఇతి.

రాజు.—వినియెదఁగాక, సందర్భము ఏదిగా నున్నదో అని.

[ఇత్యవహితః శృణోతి.

[అని అక్కఱగా వినును.

కాఞ్చ.—పృచ్ఛతు భర్తృదారికా.

కాంచ.—అడుగుము భర్తృదారికా.

ఆర.—సత్యమేవ తాత ఏవం మన్త్రయతే? యథా.—'యది వీణాం [1]వాదయన్ అపహరతి మాం వత్సరాజః, అవశ్యం ముఞ్చామీ'తి.

ఆర.—నిజముగానే నాయన యిట్లు చెప్పెనా? ఏమనఁగా.—వీణను వాయింపించుచు వత్సరాజు నన్ను (చండమహాసేనుని) మెప్పించినయెడల, తప్పక విడిచెదను' అని.

[2] రాజా.—(ప్రవిశ్య పటాక్షేపేణ, సహర్షం వస్త్రాన్తె గ్రన్థిం బద్ధ్వా)

రాజు.—(పటాక్షేపంబునం బ్రవేశించి, సంతసముతో వలువయంచున ముడి

1. చండమహాసేనుని యభిప్రాయమున-'వాదయన్' ణిచ్చుమీఁద ణిచ్చు, (వాసవదత్తచేత) వాయింపించుచు అని యర్థము. 'మేము మెచ్చునట్లుగా నీచేత వత్సరాజు వీణవాయింపించెనేని అతనిని చెఱనుండి విడుదల చేసెదను,' అనుట.

2. పైచండమహాసేనవాక్యమునకు వత్సరాజు ఇట్లు అర్థాంతరము కల్పించి పలు

ఆర.—కంచణమాలే, చిట్ఠదు వీణా. పుచ్ఛిస్సం దావ కింపి.

కాఞ్చ.—పుచ్ఛదు భట్టిదారిఆ.

ఆర.—సచ్చం ఎవ్వ తాదో ఎవ్వం మంతేది? జహ 'జఇ వీణం వాదఅంతో అవహరది మం వచ్ఛరాఓ, అవస్సం ముంచేమి' త్తి.

ఏవ మేతత్ క స్సందేహః ? — వైచి) సరియు ఇది. సందేహ మేమి?

సపరిజనం ప్రద్యోతం — ప్రద్యోతునికిని అతనిపరిజనములకును

విస్మయ ముపనీయ వాదయన్ — ఆశ్చర్యము పుట్టించి, వీణను వాయించుచు

వీణామ్

వాసవ దత్తా మచిరాత్ — వాసవదత్తను త్వరగాలో అపహరించెద నని

పశ్యా మ్యహ మపహర్తా మీతి. — నమ్ముచున్నాను.

యతః సువిహితం సర్వం — ఎట్లనగ, యౌగంధరాయణుఁడు సకల

కును-'వీణను వాయించుచు వత్సరాజు వాసవదత్తను కొనిపోయినప్పుడెల్ల ఆమె నతనికి వదలెదను' అని. పటాక్షేపము-తెర వేయమి; పాత్రప్రవేశమునకు తెర వేయుటయు సంభ్రాంతప్రవేశమునకు తెరవేయమియు నియతములు. వస్త్రాంతమున ముడివే యుట ప్రతిజ్ఞాసూచనార్థము.

ఇదిమొదలుగా రాజుయొక్క కొన్ని భాషితములను రాజు ఉజ్జయినిలో వాసవదత్తా కాంచనమాలలకడకే యేఁగుచు పలికినను వారు వినలేదు. వారిభాషితములను మాత్రము రాజు వినుచునే యుండెను. వాసవదత్త రెండుపాటలు వీణమీఁద పాడినదనుసంగతము వత్స రాజు తటాలున ఆమెను సమీపించి ఆసంగీతమును పొగడెఁదొడంగుటయు ఆయనను వారు చూడలేదు. అతఁడక్కడనుండుట నెఱుంగరు. అపుడు చూచినవెంటనే వాసవ దత్త లేచి యాతనికిం బ్రణమిల్లినది. ఇట్లని రాఁగలగ్రంథమువలన తేటపడును. వత్సరాజు 'యది వీణా మి'త్యాదివాక్యమును (౧) వాసవదత్త పలుకఁగా విన్నాఁడా? (౨) కంచుకి ఆమెతోఁ చెప్పినట్లే ఆమాటను ఆయనతోను చెప్పినాఁడా? (౩) వత్సరాజనుకొన్న మాట వారు పలికికొన్న మాటయు కాకతాళీయముగా ఒండొకటితో సరిపోయినవా?. (౪)వ పక్షము సరిగా నుండు నని తోఁచెడిని. కంచుకి 'వత్సరాజును పంపెదను' అని చెప్పపోవు టయే గమకము.

3. సపరి...నీయ = పరిజనసమేతుని ప్రద్యోతుని (మన మింట కాచియున్నను ఎట్లు తప్పించుకొనిపోయినాఁడురా యీవత్సరాజు! వాసవదత్తను సైతము హరించి!యని) ఆశ్చర్యము పొందించి,వీణాం వాదయన్ (వాసవదత్తాసమేతముగా ఏనుగుమీఁద కూర్చుం డి వినోదముగా) వీణ వాయించుచు, అహమ్ అచిరాత్ వాసవదత్తామ్ అపహరామి ఇతి పశ్యామి= నేను ఇఁక కొంచెముసేపటికి వాసవదత్తను (తండ్రియనుమతి లేకుండ, అత నిని సరకుగొనక) కొనిపోయెదను అని చూచుచున్నాను.

* వక్రోక్త్యలంకారము, 'వక్రోక్తిః శ్లేషకాకుభ్యా మపరార్థ ప్రకల్పనమ్.'

యౌగన్ధరాయణేన. !

వాస.—(సహ సోత్థాయ) జయ త్వార్యపుత్త్రః.

రాజా.—(స్వగతమ్) కథమ్; ప్ర త్యభిజ్ఞాతో౽స్మి దేవ్యా.

సాంకృ.—అల మలం సంభ్ర మేణ. ప్రేక్షణీయక మేతత్.

వాస.— (సవిలక్షస్మిత ముపవిశ్య) కథం మనోరమా ఖ ల్వేషా. మ యా పునర్ జ్ఞాత మార్యపుత్త్ర ఏ ష ఇతి. సాధు! మనోరమే సాధు! శోభనం నర్తితమ్.

రాజా.—(సహర్ష మాత్మగతమ్) ఇ దానీ ముచ్ఛ్వసితో౽స్మి.

సాంకృ.—రాజపుత్త్రి, స్థాన ఏవ కారితా భ్రాన్తిర్మనోరమయా. పశ్య.—

రూపం త న్నయనోత్సవాస్పద
మిదం,
వేష స్స ఏ వోజ్జ్వలః,

ముసు చక్కఁగా ఏర్పఱిచి యున్నాఁడు.

వాస.—(తటాలున లేచి) జయము ఆర్య పుత్త్రునికి.

రాజు.—(స్వగతము) ఇఁక నెట్లు? దేవి నన్ను తెలిసికొన్న దే!

సాంకృ.—ఏల తొట్రుపాటు? ఆట (యే గదా) యిది.

వాస.—(వెడనవ్వు నవ్వుచు కూర్చుం డి) ఏమి! మనోరమయే గదా యిది. ఆర్యపుత్త్రుఁడే అని నే ననుకొంటిని. బళీ మనోరమా, బళి! చక్కఁగా ఆడితివి.

రాజు.—(సంతోసముతో, తనలో,) ఇప్పుడు నాదిగులు తీఱినది.

సాంకృ.—రాజకుమారీ, మనోరమ (యీ) భ్రాంతిని కలిగించుట యుక్తమే. కనుము.—

నేత్రానందాధారభూత మయిన యీ రూపము వత్సరాజురూపమే, వెలుఁగొం దుచున్న యీ వేషము ఆయన వేషమే,

1. యౌగంధరాయణుని పన్నాగమును ఇప్పుడే రాజు వసంతకునివలన వినె నని పూర్వోక్తోన్మత్తదర్శన ప్రస్తావముచే నూహ్యము.

2 నయన ఉత్సవ ఆస్పదమ్ ఇదం రూపం తత్ ఏవ=కన్నుల పండువునకు ఆధారమైన

వాస.—...జేదు అజ్జఉత్తో.

వాస.—...కహం మణోరమా క్షు ఏసా ! మఏ ఉణ జాణిదం అయ్యవుత్తో ఏసో త్తి. సాహు ! మణోరమే, సాహు ! సోహణం ణచ్చిదం !

సా మత్తద్విరదోచితా గతి రియం,
తత్సత్త్వ మత్యూర్జితమ్,
లీలా సైవ, స ఏవ సాన్ద్రజలద
ప్రహ్లాదానుకారీ స్వనః,
సాక్షా ద్దర్శిత ఏష నః కుశలయా
వత్సేశ ఏ వానయా.

మదపుటేనుఁగునడకవంటియీనడక ఆయననడకయే, మిక్కిలిప్రౌఢ మయినయీ గాంభీర్యము ఆయనదే, (ఈ) విలాసము అతనిదే, నీటితో నిండియున్న మేఘము యొక్క యురుమువంటి (యీ) ఎలుంగు (ను) ఆయనయలుంగే, నేర్పరి యీమనోరమ మనకు సాక్షాత్తుగా వత్సరాజునే చూపినది.

[1] వాస.—హఞ్జె, ఇన్దీవరికే, బద్ధే నార్యపుత్త్రే ణాహం వీణాం శిక్షితా, త దస్య కురు నీలోత్పల దామ్నా నిగళమ్.

వాస.—ఓసి, ఇందీవరికా, సంకెళ్లలో నుండి ఆర్యపుత్త్రుఁడు నాకు వీణ నేర్పినాఁడు, కాన నితనికి నల్లగలువదండతో సంకెళ్లు వేయుము.

[ఇతి శిరసోఽపనీయ నీలోత్పలదామార్పయతి. ఇన్దీవరికా తథా కృత్వా, పున స్తథై వోపశతి.

[అని తలనుండి తీసి నల్లగలువలదండను ఇచ్చును. ఇందీవరిక అట్లుచేసి వెండియు మునుపటివలెనే కూర్చుండును.

యీరూపము అదే (వత్సరాజుదే), ఉజ్జ్వలః వేషః స ఏవ=ప్రకాశమానమయిన (యీ) వేషము అదే (వత్సరాజుదే), మత్త ద్విరద ఉచితా ఇయం గతిః సా ఏవ = మదించిన యేనుఁగునకు తగినదైన యీ నడక అది యే (అతనినడకయే), అతి ఊర్జితం సత్త్వం తత్ (ఏవ)=మిక్కిలిప్రౌఢమయిన గాంభీర్యము అది (యే), లీలా సా ఏవ=విలాసము అదే, సాన్ద్ర జలద ప్రహ్లాద అను కారీ స్వనః స ఏవ=(నీటితో) నిండియున్న మేఘము యొక్క ధ్వనిని బోలుచున్న కంఠధ్వని (యు) అది యే, కుశలయా అనయా సాక్షాత్ వత్సేశః ఏవ ఏష నః దర్శితః = జాణయయిన యీమనోరమచే కేవలము వత్సరాజే ఇతఁడు మనకు చూపఁబడినాఁడు (వేషముచేతను ఆటచేతను సాక్షాద్వత్సరాజే అనిపించినదని భా.) ద్వౌ రదౌ యస్య సః ద్విరదః. * పదార్థావృత్తి నిదర్శనాలంకారము.

1. తలలోనిపూఁజండను పాదముల నర్పించుట భక్తి శృంగారములను సూచించుచున్నది. నల్ల(గలువల)దండ—ఇనుపసంకిలివలె నల్లగా నుండుటకు, కలువలు మృదువుగా పరిమళించుచు ఉండుటకు. పువ్వులసంకిలి అభయంకరము గానుంటకు.

---

వాస.—హంజే ఇందీవరిఏ, బద్ధేణ అయ్యవుత్తేణ అహం వీణం సిక్ఖావిదా; తా సే కరేహి ణీలుప్పలదామఏణ ణిఅళం.

ఆర.—కాఞ్చనమాలే, కథయ, కథయ, నను సత్యమేవేదం మన్త్రయతే తాతః—'యది వీణాం వాదయన్ అపహరతి మాం వత్సరాజః, తతోఽవశ్యం ముఞ్చామీ'తి?

ఆర.—కాంచనమాలా, చెప్పుము, చెప్పుము, మఱి నిజముగా మానాయన ఈ మాట చెప్పెనా 'వీణ వాయింపించుచు నన్ను వత్సరాజు అపహరించునేని అంతట తప్పక విడుతు' నని?

[1] కాఞ్చ.—భర్తృదారికే సత్యమేవ. తథా కురు యథా వత్సరాజస్య అవశ్యం బహుమతా భవిష్యసి.

కాంచ.—భర్తృదారికా, నిజమే. నీవును ఎట్లు చేసిన వత్సరాజు నిన్ను మెచ్చుకొనునో అట్లు చేయుము.

[2] రాజా.—నిష్పాదితమేవ కాఞ్చనమాలయా యదస్మాభి రాలపితవ్యమ్.

రాజు.—మేము చెప్పవలసిన దానిని కాంచనమాల చక్కఁగా నెఱవేర్చినది.

వాస.—యద్యేవం తదాదరేణ వాదయిష్యామి. [గాయన్తీ వాదయతి.

వాస.—ఆపక్షమున అక్కఱతో వాయించెదను. [పాడుచు వాయించును.

1, 2. కాంచనమాల వాసవదత్తను వత్సరాజు మెచ్చునట్లు చేయు మనఁగానే, వత్సరాజు తాఁ జెప్పవలసినమాటను కాంచనమాలయే చెప్పిన దనుటయందు-తనతో ఆ రాత్రి పలాయనము కావలసిన దని తాను వాసవదత్తను అడుగఁబోవుచున్నాఁడు గావున, అట్లడిగినప్పుడు రా ననక కూడ వచ్చునట్లు వాసవదత్తను కాంచనమాలావాక్యము దిట్టపఱచిన దని - భా.

రాజహంసః = రాయంచ (హంసవంటివత్సరాజు), ఘన బన్ధన సంరుద్ధమ్ = మేఘముల యావరణముచే ఆక్రాంతమయిన (దృఢమయిన చెఱచేత అడ్డగింపఁబడిన), గ

ఆర.—కంచణమాళే, కహేహి కహేహి; ణం సచ్చం ఎవ్వ ఇదం మంతేది తాదో: జఇ వీణం వాదఅంతో అవహరేది మం వచ్ఛరాఓ, తదో, అవస్సం బంధణాదో ముంచేమి' త్తి?

కాఞ్చ.—సచ్చం ఎవ్వ. తహ కరేహి, జహ వచ్ఛరాఅస్స అవస్సం బహుమదా హోహిసి.

ఆర.—జఇ ఎవ్వం తా ఆదరేణ వాదఇస్సం.

ఘనబన్ధనసంరుద్ధం
గగనం దృష్ట్వా మానసం నేతుమ్
అభిలషతి రాజహంసో
దయితాం గృహీత్వా ఆత్మనో
వసతిమ్.

[విదూ. నిద్రాం నాటయతి.

మనో.—(హస్తేన చాలయన్తీ). వసన్తక, పశ్య మే ప్రియసఖీ నృత్యతి.

విదూ.—(సరోషమ్) దాస్యాః సుతే, త్వ మపి న దదాసి మే స్వపితుమ్? యతః ప్రభృతి ప్రియవయస్యేన ఆరణ్యికా దృష్టా తతః ప్రభృతి తేన సహ మయా దివారాత్రం నిద్రా న లబ్ధా; తత్ నిష్క్రమ్య స్వప్స్యామి. [ఇతి నిష్క్రమ్య శేతే.

రాజహంస మేఘములచేత ఆక్రాంతమయిన యాకాశమును గాంచినదై (తన) ప్రియను తోడ్కొని తన నివాసమయిన మానససరస్సును చేర్చుటకు కోరుచున్నది.

[విదూ. నిద్ర నభినయించును.

మనో.—(చేతితో కదలించుచు) వసంతకా, చూడు చూడు నా నెచ్చెలి ఆడుచున్నది.

విదూ.—(కోపముతో) లంజ కూతురు గానీవు సయితము నన్ను నిద్ర పోనీయవా? ఎప్పుడు తొలిమారు ప్రియవయస్యుడు ఆరణ్యకను చూచినాడో అప్పటినుండి అతనితో గూడ నాకు (ను) రేయుంబవలు నిద్ర లేదు. కావున బయటికి పోగి నిద్రింపదను.

[అని వెలిపోగి పరుండును.

గనం దృష్ట్వా=ఆకాశమును (ఆకాశమువలె అతివిశాలమైన ఉజ్జయినిని) చూచి, ఆత్మనః దయితాం గృహీత్వా = (తన) ప్రియను (హంసిని, వాసవదత్తను) తోడ్కొని, ఆత్మనః వసతిం మానసం నేతుమ్ అభిలషతి=తన నివాసమయిన మానససరస్సును (సౌభాగ్యమందు మానససరస్సువంటి వైనకౌశాంబిని) చేర్చుటకు కోరుచున్నది (కోరుచున్నాడు).

ఎచ్చోట మేఘోదయ మగునో అచ్చోటు వదలి హంసలు మానససరస్సున కేగుట ప్రసిద్ధము. రాజహంసలు ముక్కును పాదములును ఎఱ్ఱగానుండు తెల్లపక్షులు.

అర్థద్వయము స్పష్టము. * సారూప్యనిబన్ధనాప్రస్తుతప్రశంసాలంకారము.

---

ఘణబంధణసంరుద్ధం । గఅణం దట్ఠూణ మాణసం ణేదుం
అహిలసఇ రాఅహంసో । దఇఅం ఘేత్తూణ అప్పణో వసఇం.
మనో.—...వసంతఅ పెక్ఖ పెక్ఖ, మే పిఅసహీ ణచ్చఇ.
విదూ.—...దాసీఏసుదే తుమం వి ణ దేసి మే సుపిదుం? జదో పహుది పిఅవఅస్సేణ ఆరణ్ణిఆ దిట్ఠా తదో పహుది తేణ సహ మఏ దివారత్తం ణిద్దా ణ లద్ధా. తా ణిక్కమిఅ సువిస్సం...

ఆర. (పున ర్గాయతి.)

[1] అభినవరాగక్షిప్తా
మధుకరికా వామకేన కామేన
ఉత్తామ్యతి ప్రార్థయమానా
ద్రష్టుం ప్రియదర్శనం దయితమ్.

ఆర—(మఱల పాడును.)

తుమ్మెదకొమ్మ క్రించయినమదనుని వూలమున క్రొత్తవలపుచేత గెంటఁబడినదై తనకు కన్నులవిందయినకాంతుని చూడఁగోరి అలయుచున్నది.

[2] రాజా.—(శ్రుత్వా సహర్షోపసృత్య) సాధు! రాజపుత్రి, సాధు! అహో గీత మహో వాదిత్రమ్! తథా హి;—

రాజు.—(విని తటాలున దరిసి) బళీ! రాజకుమారీ, బళి! ఆహా పాట! ఆహా వాద్యము! అట్లె గదా;—

వ్యక్తి ర్వ్యఞ్జనధాతునా దశవిధే నా ప్యత్ర ల బ్ధామునా,

ఈపాటయందు పదివిధముల వ్యంజనధాతువులచేతను వ్యక్తి కలిగినది. ద్రుతము

1. మధుకరికా వామకేన కామేన అభినవ రాగ క్షిప్తా (సతీ) = తేఁటి పెంటి కుటిలుఁడయిన మదనునిచే క్రొత్త వలపుతో నెట్టఁబడినదై, ప్రియ దర్శనం దయితం ద్రష్టుం ప్రార్థయమానా ఉత్తామ్యతి = కంటివిందుగా తోఁచువాఁడైన ప్రియుని (తనమగ తేఁటిని) చూడ వేఁడుచు బడల్పడుచున్నది. వాసవదత్త కుటిలాత్ముఁడు మదనుఁ డిడినయీ వత్సరాజుమీఁదివలపుచే ప్రేరింపఁబడినదై వత్సరాజును నేత్రోత్సవముగాఁ గాంచుటకు కోరినదై ఆయన ఇంకను రామికి ఆయాసపడుచున్నది; అని గూఢ భా. వామకేన—ఆమెకు విరహాయాసము కలిగించును గాన. అభినవ—అనురాగము ప్రాఁతగిల్లిచో విరహము ఓర్వశక్యము గావున, ఈవిరహము ఓర్వరాని దని ఈవిశేషణము సూచించున్నది. ఉత్తామ్యతి—ఎంతసేపటిని రానందులకు. * సారూప్యనిబంధనాప్రస్తుతప్రశంసాలంకారము. ఈరెండుపాటలకు ఈప్రస్తుతార్థములను వాసవదత్త ఉద్దేశించినదా? ఉద్దేశించినది. తన్నుం దోడ్కొని చెఱనుండి పలాయన మగుటకు అతనికోర్కి యని ఆమెకు తెలిసియున్నది.

2. ఈమెప్పు వాసవదత్త సంగీతమునకే గాక ఆరణ్యికసంగీతమునకును అన్వయమే; ఆరణ్యికయు ఈసంవత్సర మెల్ల సంగీతాదివిద్యలయందు శిక్షిత గావున వాసవదత్తా సంగీతస్తుతిమిషమున రాజు ఆరణ్యికాసంగీతమును పొగడుచున్నాఁడు.

---

ఆగ.—
అహిణవరాఅక్ఖిత్తా। మహుఅరిఆ వామఏణ కామేణ
ఉత్తమ్మఇ పత్థంతీ దట్ఠుం పిఅదంసణం దఇఅం.

విస్పష్టో ద్రుత మధ్య లమ్బిత పరిచ్ఛిన్న స్త్రిధాఽయం లయః, గోపుచ్ఛ ప్రముఖాః క్రమేణ యతయ స్తిస్రోఽపి సంపాదితాః, తత్త్వౌఘానుగతా శ్చ వాద్య విధయ స్సమ్యక్త్రయో దర్శితాః.

మధ్యము విలంబితము నని ముత్తెఱంగుల భిన్నమైయుండు నీలయ స్పష్టపడినది; గోపుచ్ఛము లోనగు మూఁడు యతులును క్రమముగా చూపఁబడినవి; తత్త్వము, ఓఘము, అనుగతము, నను వాదనప్రకారములు మూఁడును చక్కఁగా చూపఁబడినవి.

ఆర.—(వీణాం పరిత్యజ్య ఆసనా దుత్థాయ రాజానం సాభిలాషం పశ్యన్తీ) ఉపాధ్యాయ, ప్రణమామి.

ఆర.—(వీణను వదలి ఆసనమునుండి లేచి రాజును కోర్కితో కనుచు) ఒజ్జా, మ్రొక్కుచున్నాను.

[1] రాజా.—(సస్మితమ్) యద హ మిచ్ఛామి త త్తే భూయాత్.

రాజు.—(నవ్వుచు) ఏది నేను కోరుచున్నానో అది నీ కగును గాక.

కాఞ్చ.—(ఆరణ్యికాయా ఆసనం నిర్దిశ్య) ఇహై వోపవిశ తూపాధ్యాయః.

కాంచ.—ఆరణ్యికయొక్క ఆసనము ను చూపి) ఉపాధ్యాయులవారు ఇటనే కూర్చుండవలయు.

వ్యక్తిః = గానరసస్ఫూర్తి; ధాతువులు ప్రహారవిశేషస్థ స్వరములు; అందు వ్యంజనధాతువులు అంగుళీభేదమాత్రముచే నేర్పడునవి; అవి పదితెఱఁగులు; లయ యనఁగా క్రియానంతరవిశ్రాన్తి; ద్రుతము శీఘ్రుతమము, దానికి ద్విగుణము మధ్యమము, దానికి ద్విగుణము విలంబము; యతి యనఁగాఁ ప్రవృత్తినియమము; యతులు సమ, స్రోతోగత, గోపుచ్ఛ, అని ముత్తెఱఁగులు; తత్త్వము, ఓఘము, అనుగతము, అనునవి గీతానుగమయిన వాద్యమునం భేదములు; లయాదికమును వ్యక్తపఱుచుచు గీతమిళితమయిన వాద్యము తత్త్వము; కించిద్గీతానుకరణముచే అనుగతము; నిరస్తగీతపాణిఘాతము తములచే సముదాయానుకారితము ఓఘము.

1. నాతోఁగూడ పలాయితవై వచ్చి నాకు పట్టపుదేవి వగుదువు గాక యని భా. మ్రొక్కినవారికోర్కి తీఱునట్లు ఆశీర్వదించుట న్యాయ్యమై యుండ ఆశీర్వదించువారి కోరిక తీఱునట్లు ఆశీర్వదించుట వింత గావున అందుకై స్మితము.

---

ఆర.—...ఉవజ్ఝాఅ, పణమామి.
కాఞ్చ.—...ఇహ ఎవ్వ ఉవవిసదు ఉవజ్ఝాఓ.

రాజా.—(ఉపవిశ్య) రాజపుత్త్రి క్వేదానీ ముపవిశతు ?

కాఞ్చ.— (సస్మితమ్) ఇదానీ మేవ భర్తృదారికా విద్యాగుణ పరితోషితా యుష్మాభిః; తదర్హా త్యే వైషా ఉపాధ్యాయపీఠికామ్.

[1] రాజా.—ఉపవిశ త్వ ర్హా య మర్ధాసనస్య; రాజపుత్త్రి, స్థీయతామ్. [అర. కాఞ్చ - లాం పశ్యతి.

కాఞ్చ. — (సస్మితమ్) భర్తృదారికే, ఉపవిశ; కో౽త్రదోషః ? శిష్యావిశేషః ఖలు త్వమ్.

[అర. సలజ్జ ముపవిశతి.

వాస.—(సలజ్జమ్) భగవత్యా అధికం కల్పితం కావ్యమ్. న ఖల్వహం తస్మిన్ కాలే ఏకాసనే ఆర్యపుత్త్రేణ సహోపవిష్టా.

రాజా —రాజపుత్త్రి, పునః శ్రోతు మిచ్ఛామి. వాదయ వీణామ్.

రాజు.— (కూర్చుండి) రాజకుమారి యిపు డెటఁ గూర్చుండవలయును. ?

కాంచ.—(నవ్వుచు) ఇపుడే భర్తృదారికను మీరు విద్యాగుణముంబట్టి మెచ్చుకొంటిరి. కావున ఈమె ఉపాధ్యాయుల వారిపీఠమునకు తగినదే.

రాజు.—కూర్చుండునుగాక, ఈసుందరి అర్ధాసనమునకు తగినదే; రాజకుమారీ, కూర్చుండుము. [అర. కాంచనమాలం గనును.

కాంచ.—(నవ్వుచు) భర్తృదారికా, కూర్చుండుము; ఏమి యిందులో దోషము? శిష్యావిశేషమవు గదా నీవు.

[అర. సలజ్జముగా కూర్చుండును.

వాస.—(లజ్జతో) భగవతీ, కావ్యము ఎక్కువగా కల్పింపఁబడినది. ఆసమయము లో నేను ఆర్యపుత్త్రునితో ఏకాసనమునఁ గూర్చుండనే లేదు.

రాజు.—రాజకుమారీ, వెండియు వినఁ గోరికగా నున్నది. వాయింపుము వీణను.

1. నాసింహాసనమందు అర్ధమున కర్హురాలు, నాతోఁ గూడ నేకసింహాసనాసీనవై నారాజ్యమునకు పట్టాభిషేకము పొందఁదగినది, అని గూఢాభిప్రాయము.

---

కాఞ్చ.—...దాణిం ఎవ్వ భట్టిదారిఆ విజ్జాగుణపరితోసిదా తుహ్మేహిం; తా అరుహిది ఎవ్వ ఏసా ఉవజ్ఝాఅపీఠిఆఏ.

కాఞ్చ.—...భట్టిదారిఏ, ఉవవిస. కో ఎత్థ దోసో? సిస్సవిసేసా క్ఖు తుమం.

వాస.—...భఅవదీఏ, అహిఅం కప్పిదం కవ్వం; ణక్ఖు అహం తస్సిం కాలే ఎక్కాసణే అయ్యఉత్తేణ సహ ఉవవిట్ఠా.

ఆర.—(సస్మితమ్) కాఞ్చనమాలే, చిరం ఖలు మమ వాదయన్త్యాః పరిశ్రమో జాతః. ఇదానీం నిస్సహా న్యఙ్గాని. తన్న శక్నోమి వాదయితుమ్.

ఆర.—(చిఱునవ్వుతో) కాంచనమాలా, చాలసేపటినుండి వాయించుచున్నందున నాకు అలంతగా నున్నది. ఇప్పుడు నాయంగములు డస్సియున్నవి, కనుక వాయించుటకు శక్తురాలను గాను.

కాఞ్చ.—ఉపాధ్యాయ, సుష్ఠు పరిశ్రాన్తా భర్తృదారికా కపోలతలబద్ధస్వేదకణజాలకా. పశ్యాస్యా వేపేతే అగ్రహస్తౌ. తత్ సమాశ్వస్తా భవతు ముహూర్తమ్.

కాంచ.—ఉపాధ్యాయా, మిక్కిలిడస్సినది భర్తృదారిక, చెక్కిళ్ళమీఁద క్రొంజెమట ముత్తెలవలె బొట్లు కట్టియున్నది; చూడుము ఈమె ముంజేతులు వణఁకుచున్నవి. కనుక ఇంచుకసేపు అలపు తీర్చుకొననిమ్ము.

రాజా.—కాఞ్చనమాలే, యుక్తమభిహితమ్.

రాజు.—కాంచనమాలా, సరిగా చెప్పితివి.

[హస్తే గ్రహీతు మిచ్ఛతి.
[ఆర. హస్త మపసారయతి.

[చేయి పట్టుకొనఁ బోవును.
[ఆర. చేయి వెనుకకు తీసికొనును.

వాస.—(సాసూయమ్) భగవతి, అధికం త్వయా కృతమ్. న ఖల్వహం కాఞ్చనమాలాకావ్యేన వఞ్చయితవ్యా.

వాస.—(అసూయతో) భగవతీ, నీవు ఎక్కువ రచించితివి. కాంచనమాలయొక్క కావ్యముతో నన్ను వంచింప వలనుపడదు.

సాంకృ.—(విహస్య) ఆయుష్మతి, ఈదృశ మేవ కావ్యం భవిష్యతి.

సాంకృ.—(నవ్వి) ఆయుష్మతీ, కావ్యమనఁగా ఇట్టిదిగానే యుండును.

ఆర.—(సరోషమివ) అపేహి

ఆర.—(కోపముతోనుంబోలె) పో

---

ఆర.—...కంచణమాలే చిరం క్ఖు మమ వాదఅంతీఏ పరిస్సమో జాదో! దాణిం ణీసహాఇం అంగాఇం; తా ణ సక్కుణోమి వాదిదుమ్.

కాఞ్చ.—ఉవజ్ఝాఅ సుట్ఠు పరిస్సంతా భట్టిదారిఆ కవోలదలబద్ధసేదకణజాలఆ; పెక్ఖ సే వేవంతి అగ్గహత్థా తా సమస్సత్థా హోదు ముహుత్తఅం.

వాస.—...భఅవది, అహిఅం తుఏ కిదం. ణ క్ఖు అహం కంచణమాలాకవ్వేణ వంచఇదవ్వా.

కాఞ్చనమాలే; అపేహి, న మే బహుమతాసి.

కాంచనమాలా పో, నాకు సమ్మతవు గావు.

కాఞ్చ.—(సస్మితమ్) య ద్యహం తిష్ఠన్తీ న బహుమతా, త దహం గచ్ఛామి. [ఇతి నిష్క్రాన్తా.

కాంచ.—(చిఱునవ్వుతో) నేను ఉండిన సమ్మతి గాదేని, పోయెదను.

[అని నిష్క్రమించును.

ఆర.—(ససంభ్రమమ్) కాఞ్చనమాలే, తిష్ఠ; అయ మస్య సమర్పితో౽ గ్రహస్తః.

ఆర.—(తత్తరపాటుతో) కాంచనమాలా, పోకుపోకు. ఇదె యీయనకు ఇచ్చితిని ముంజేతిని.

రాజా.—(ఆరణ్యికాయా హస్తం గృహీత్వా)

రాజు.—(ఆరణ్యికచేతిని కైకొని)

సద్యో౽వశ్యాయ బిన్దు
వ్యతికరశిశిరః
కిం భవేత్ పద్మకోశో?
హ్లాదిత్వం నాస్య మన్యే
సహజ మిదముష
స్యేవ పీతాతపస్య;

(నాచేతిలోని) యిది మంచుబొట్లు ఇప్పుడే కూడుటచేత చలువచల్లుచున్న తామరమొగ్గ యగునా యేమి? నైసర్గికమైన యీ యాహ్లాదకరత్వము వేసవనే ఎండం ద్రావున దైన తామరమొగడకు ఉండదని తలంచెదను. మఱి ఇట్లు మంచుమొ

(నాచేతిలోని యీవస్తువు), సద్యః అవశ్యాయ బిన్దు వ్యతికర శిశిరః పద్మకోశః భవేత్ కిమ్ = అప్పుడే మంచు బొట్ల సంబంధముచేత చల్లనయిన తామర మొగ్గ అగునా ఏమి? సహజమ్ హ్లాదిత్వమ్ ఉషసి ఏవ పీత ఆతపస్య అస్య న మన్యే = నైసర్గికమయిన యీ యాహ్లాదకరత్వము వేసవ నే త్రాగఁబడిన యెండగలదైన దీనికి (తామరమొగడకు) ఉండ దని తలంచెద; ఏవం హిమ ఓఘం ముఞ్చతి నను రజనికరః= ఇట్లు మంచు మొత్తమును కురియుచున్నది, చంద్రుఁడుగా నుండునా? హన్త కిమ్= అయ్యో! ఏమి? సః అపి దాహీ = అతఁడు ను (విరహులను) కాల్చువాఁడు. జ్ఞాతమ్ - ఏషః హస్తః-స్వేద అపదేశాత్ అవిరతమ్ అమృతం స్యన్దతే = తెలిసినది- ఇది చేయి-

---

ఆర.—...అవేహి కంచణమాలే, ణ మే బహుమదాసి.
కాఞ్చ.—...జఇ అహం చిట్ఠంతీ ణ బహుమదా, తా అహం గచ్ఛామి.
ఆర.—...కంచణమాలే, చిట్ఠ చిట్ఠ. అఅం సే సమప్పిదో అగ్గహత్థో.

(ఇందునుండి) చెమరు నెపమున తెంపులేక అమృతము కురియుచున్నది. ఇది తామర మొగ్గ గాదు, జాబిల్లి గాదు, చేయి; ఇవి మంచుబొట్లు గావు, అమృతపుబొట్లవంటివి చెమటబొట్లు, అని తా. *నిశ్చయాంతసందేహాలంకారము, 'స్యాత్స్మృతిభ్రాన్తి సందేహై స్తదఙ్కాలంకృతిత్రయమ్.' స్వేదాపదేశాత్-అపహ్నుతి, 'కైతవాపహ్నుతి ర్వ్యక్తౌ వ్యాజాద్యై ర్నిహ్నుతేః పదైః.' సద్యః—మంచు తామరను మూడ్చును గావునను మాడకముందు తొలిశోభ యెడలమియే గాక మంచుచేత దర్శనీయత అతిశయించియే యున్నయవస్థకై 'సద్యః' అనుట. హిమార్తసరోజము శోభించు ననుటకు సంవాదము:—

'బాష్పవర్షేణ నీతం వో జగన్మఙ్గళ మాననమ్,

అవశ్యాయావసిక్తస్య పుణ్డరీకస్య చారుతామ్?' ఉత్తర.

ప్రియాపాణిస్పర్శాదికము చలువలు గ్రమ్ము ననుటకు సంవాదము:

'ప్రశ్చ్యోతన న్ను హరిచన్దన పల్లవానాం,

నిష్పీడితేన్దుకర కన్దళజో ను సేకః,

ఆతప్తజీవితతరోః పరితర్పణో మే

సంజీవనౌషధిరసో ను హృది ప్రసిక్తః.' ,,

'గృహీతో యః పూర్వం పరిణయవిధౌ కఙ్కణధరః

సుధాసూతేః పాదై రమృతశిశిరై ర్యః పరిచితః

స ఏ వాయం తస్యా అనితరకరౌపమ్యసుభగో

మయా లబ్ధః పాణి ర్లలితలవలీకన్దళనిభః.' ,,

'జీవయ న్నివ సమూఢసాధ్వస స్వేదబిన్దు రధికణ్ఠ మర్పయతామ్

బాహు రైన్దవమయూఖచుమ్బిత స్యన్దిచన్ద్రమణిహారవిభ్రమః.' ,,

'సంతాపో హృదయ, స్మరానలకృతః సంప్రత్యయం సహ్యతాం,

నా స్త్యే వోపశమోఽస్య, మాం ప్రతి పునః కిం త్వం ముధా తామ్యసి?

యస్మా ద్యేన మయా తదా కథ మపి ప్రాప్తో గృహీత్వా చిరం

విన్యస్త స్త్వయి సాన్ద్రచన్దనరసస్పర్శో న తస్యాః కరః.' రత్నా.

కోశః = మొగ్గ. మొగ్గ అనుట తనచేతిలో మునిఁగి యుండుటంబట్టి. తామర మొగ్గయో యని సందేహించి కాదని నిర్ణయించుకొనుచున్నాఁడు. ఈశ్లోకమందు కరముయొక్క స్పర్శగుణము వర్ణింపఁబడుచున్నది. ఆస్పర్శము చలువ; తామరమొగ్గ యొక్క చలువ ఎండ్రతాఁగుటచేత తగ్గును గావునను, ఉన్నరవంతసేపయినను మంచు బొట్టులది గాని సహజము గాదు గావునను, ఈస్పర్శ సహజంబును ఉష్ణలేశము సోఁకనిది గావునను, తామరమొగ్గ గా దని నిశ్చయించుట. ఉషసి - అనుట, వేకువనే మంచుగ్రమ్మును గావునను, అప్పుడే క్రమ్మిన మంచుచేత శోభ వర్ధిల్లును గావునను, అయినను

ముఞ్చ త్యేవం హిమకాఘుం
 నను రజనికరో ?
 హస్త కిం సోఽపి దాహీ.
జ్ఞాతం స్వేదాపదేశా
 దవిరత మమృతం
స్యన్దతే హస్త ఏషః.

త్తమును గురియుచున్నదే, జాబిల్లియా ? ఇసీ, ఏమి ! ఆజాబిల్లియు గ్రాఁచువాఁడు. తెలిసినది; ఇది చేయి, చెమరునెపమున తెంపులేక అమృతము గురియుచున్నది.

అపి చ,

మఱియు,

[1] ఏతేన బాల విద్రుమ
పల్లవశోభాఽపహార దక్షేణ
 హృదయే మమ త్వయాఽద్య
న్యస్తో రాగః స్వహస్తేన.

నీ విపుడు నా హృదయమున (ఉరమునను, మనస్సులోను) లేఁత పవడపుఁజివురయొక్క జిగిని హరింప జాణయయిన, యీనీచేతితో రాగమును (ఎఱ్ఱఁదనమును, (అనురాగమును) ఉంచితివి.

[2] ఆర.—(స్పర్శవిశేషం నాటయన్తీ ఆత్మగతమ్.) హాధిక్! హాధిక్! ఏతం మనోరమం స్పృశన్త్యా అగ్రహస్తే నైవ వికుర్వతే మేఽఙ్గాని.

ఆర.—(.స్పర్శవిశేషము నభినయించుచు మనస్సులో) అయ్యయో ! ఈమనోహరుని చేతికొనతోనే తాఁకినంతట నా యవయములు ఆనంద మొందుచున్నవి.

అప్పుడే లేయెండదోషము సయితము సోఁకును గావునను. నను—'ప్రశ్నావధారణానుజ్ఞానునయామన్త్రణే నను.' నానా. అపి - అనుటచే తామరమొగ్గయందు ఎండదోషము ఉన్నట్లే చంద్రునియందు విరహిదాహదోషమున్నది అని భా. మంచున్నను దాహదోషముచే అతనియందును సంపూర్ణహ్లాదిత్వము లేనందున అతఁడునుం గాఁడు అని నిశ్చయము. రాజు ఈశ్లోకమునను ఈ వెంబడిశ్లోకమునను అటునెపమున ఆరణ్యకమీఁది యనురక్తినే తెలుపుచున్నాఁడు.

1. రాజామెచేతిని ఱొమ్మున నిడుకొనుటను 'నీమీఁద ననురక్తుఁడను' అని భా.

2. అగ్రం చ సః హస్త శ్చేతి అగ్రహస్తః, కర్మ. స. వికుర్వతే—'హర్షమాణో వికుర్వాణో ప్రమనా హృష్టమానసః.' అమరః. రాజని యెఱిఁగి రాజస్పర్శసుఖము ననుభవించుచు ఆరణ్యక నటనమిషచేత అనుకొనుట. అగ్రహస్తె నైవ—కౌఁగిట నెట్టిసుఖమో చెప్పవలయునా! అని భా.

---

ఆర.—...హద్ధి ! హిద్ధి ! ఏదం మణోరమం పరిస్సంతీఏ అగ్గహత్థేణ ఎవ్వ వికరెంతి మే అంగాఇం.

వాస.—(సహ సోత్థాయ) భగవతి, పశ్య త్వమ్. అహం పునర లీకం న పారయామి ప్రేక్షితుమ్.

వాస.—(తటాలున లేచి) భగవతీ, నీవు చూడుము. నే నీ అలీకము (నాటకము) ను చూడఁజాలను.

సాంకృ.—రాజపుత్త్రి, ధర్మశాస్త్రవిహిత ఏష [1]గాన్ధర్వో వివాహః. కి మత్ర లజ్జాస్థానమ్? ప్రేక్షణీయక మిదమ్, త న్న యుక్త మస్థానే రసభఙ్గం కృత్వా గన్తుమ్.

సాంకృ.—రాజపుత్త్రీ, ధర్మశాస్త్రమందు విధింపఁబడినది యిది గాంధర్వవివాహము. ఇందు లజ్జకు కారణ మేమున్నది? ఆట ఇది, కావున అకారణముగా రసము చెడఁగొట్టి లేచిపోవుట యుక్తముగాదు.

[వాస. పరిక్రామతి.

[వాస. నడచును.

ఇన్దీ.—(విలోక్య) భట్టిని, వసన్తక శ్చిత్రశాలాద్వారే ప్రసుప్త స్తిష్ఠతి.

ఇందీ.—(చూచి) దేవీ, వసంతకుఁడు చిత్రశాలాద్వారమందు నిద్రించుచున్నాఁడు.

వాస.—(నిరూప్య) వసన్తక ఏ వైషః. (విచిన్త్య) రాజ్ఞా ప్యత్ర భవితవ్యమ్. తత్ బోధయిత్వా ప్రక్ష్యామి తావ దేనమ్. [బోధయతి.

వాస.—(చూచి) వసంతకుఁడే యితఁడు. (ఆలోచించి) రాజు నయితము ఇటనే యుండును. కనుక ఇతని నిద్రలేపి అడిగెదను. [నిద్ర లేపును.

విదూ.—(నిద్రాజడ ముత్థాయ సహాసా విలోక్య) మనోరమే, కిం నర్తిత్వా ఆగతః ప్రియవయస్యః, అథవా నృత్య త్త్యేవ?

విదూ.—(నిద్రమబ్బుతో లేచి తటాలున చూచి) మనోరమా, ఏమి ఆడివచ్చినాఁడా ప్రియవయస్యుఁడు, లేక ఆడుచునే యున్నాఁడా?

1. అన్యులపెత్తనము లేక వధూవరులు పరస్పరానురక్తిచే భార్యాభర్తలగుట.

వాస.—...భఅవది పేక్ఖ తుమం. అహం ఉణ అలిఅం ణ పారేమి పెక్ఖిదుం.
ఇన్దీ.—...భట్టిణి, వసంతఓ, చిత్తసాలాదువారే పసుత్తో చిట్ఠఇ.
వాస.—...వసంతఓ ఏవ్వ ఏసో....రణ్ణావి ఎత్థ హోదవ్వం. తా బోధిఅ పుచ్ఛిస్సం దావ ణం.
విదూ.—...కిం ణచ్చిఅ ఆఅదో పిఅవఅస్సో ఆదు ణచ్చది ఏవ్వ?

¹ వాస.—(సవిషాదమ్) కథ మార్యపుత్త్రో నృత్యతి! మనోరమా ఇదానీం కథమ్!

వాస.—(వగపుతో) ఏమీ! ఆర్యపుత్త్రుఁడా నటించుచున్నాఁడు! మఱి మనోరమ యేమయినది.

విదూ.—ఏషా చిత్రశాలాయాం తిష్ఠతి.

విదూ.—ఇదె చిత్రశాలలోనున్నది.

² మనో.—(సభయమ్) కథ! మన్యథైవ హృదయే కృత్వా దేవ్యా మన్త్రితమ్. ఏతేన మూర్ఖవటుకేన అన్యథైవ బుద్ధ్వా సర్వ మాకులీకృతమ్!

మనో.—(భయముతో) ఏమి! మనస్సులో వేఱే అభిప్రాయముతో దేవి పలికినది. ఈ తెలివితక్కువబట్టువాఁడు మఱియొకవిధముగా గ్రహించి సమస్తము పాడుచేసినాఁడు!

వాస.—(సరోషం, హసన్తీ) సాధు! మనోరమే, సాధు! శోభనం త్వ

వాస.—(కోపముతో, నవ్వుచు) లెస్స! మనోరమా, లెస్స! చక్కఁగా నటించి

1. మనోరమ రాజువేషము వేయవలసినది గావున ఈప్రశ్న.

2. దేవి 'నటించుచున్నాఁడా' అని ప్రశ్నగా ఉద్దేశించినమాటను 'నటించుచున్నాఁడు' అని తనకు (విదూషకునికి) ఉత్తరముగాను, ఆర్యపుత్త్రునివేషము వేసికోవలసినదైనమనోరమ ఆయన తనవేషమునకు తానే వచ్చినయెడల తాను ఇపుడేమి సేయుచున్నది (ఏవేషమున నున్నది) అనునభిప్రాయముగా దేవి అనుకొన్నమాటను మనోరమ ఎక్కడ నున్నది అని తనకు (విదూషకునికి) ప్రశ్నగాను, భ్రమసి, యీమూర్ఖుఁడు నన్నుఆమెకు చూపించి పన్నాగ మంతయు పగులఁగొట్టినాఁడు.—అని భా. వటు వనుట తిరస్కారముచేత;—'చాణక్యవటుః.' ముద్రా. 'నివార్యతా మాళి కిమ ప్యయం వటుః పున ర్వివక్షుః స్ఫురితోత్తరాధరః.' కుమా. 'చపలో౽యం వటుః' శాకు. 'పశ్యత వటోః క్షత్త్రియావష్టబ్ధస్య గర్జితాని.' 'కర్ణే రటన్ కటు కథన్ను వటుర్వ్యపహ్యాః.' 'ఆః దురాత్మన్ క్షత్త్రియాపశద, వటు రితి మా మధిక్షిపసి!' వీర.

---

వాస.—...కహం అజ్జవుత్తో ణచ్చది! మణోరమా దాణిం కహం?

విదూ.—ఏసా చిత్తసాలాఏ చిట్ఠఇ.

మనో.—...కహం అణ్ణహా ఎవ్వ హిఅఏ కరిఅ దేవీఏ మంతిదం; ఏదేణ ముక్ఖవడుఏణ అణ్ణహా ఎవ్వ బుద్ధిఅ సవ్వం ఆఉలీకిదం!

వాస.—...సాధు! మణోరమే, సాహు! సోభణం తుఏ ణచ్చిదం!

యా న ర్తితమ్!

మనో.—(సభయం కమ్పమానా పాదయో ర్నిపత్య) భట్టిని, న ఖల్వాహ మత్రాపరాధ్యామి, ఏతేన ఖలు హతాశేన బలా దలంకరణాని గృహీత్వా ద్వారస్థితేన ఇహ నిరుద్ధా. మయాఽఽక్రన్దితేఽపి మురజ నిర్ఘోషాన్తరితో న కే నాపి శబ్దః శ్రుతః.

వాస.—హఞ్జే, ఉత్తిష్ఠ. జ్ఞాతం సర్వమ్. వసన్తకః ఖలు ఆరణ్యికా వృత్తాన్తనాటక సూత్రధారః.

విదూ.—స్వయ మేవ చిన్తయ, కుత్ర ఆరణ్యికా, కుత్ర వసన్తకః!

వాస.—మనోరమే, సుగృహీతం కృత్వా ఏన మాగచ్ఛ. ప్రేక్షణీయక మస్య ప్రేక్షావహే.

మనో.—(స్వగతమ్) ఇదానీం సమాశ్వ స్తాస్మి. (ప్రకాశమ్) తథా. (ఇతి విదూషకం కణ్ఠే బద్ధ్వా.) హతా

తివి నీవు!

మనో.—(భయముతో వణంకుచు పాదములలో (వ్రాలి) దేవీ, ఇందు నాతప్పేమియు లేదు. ఈ చెడిబ్రదికినవాఁడు బలిమిచే అలంకారములు లాగుకొని ద్వారములో ఉండి నన్నిచ్చట అరికట్టినాఁడు. నేను (ఎంత) మొఱపెట్టినను మద్దెళ్ల మ్రోఁతలో (నా) మొఱ ఎవరికిని వినఁబడ దాయెను.

వాస.—ఓసి లెమ్ము. తెలిసినది సమస్తము. వసంతకుఁడు గదా ఆరణ్యికావృత్తాంతనాటకసూత్రధారుఁడు.

విదూ.—నీవే ఆలోచింపుము, ఆరణ్యిక యెక్కడ, వసంతకుఁ డెక్కడ!

వాస.—మనోరమా, ఇతనిని దిట్టముగా పట్టుకొని రా. ఇతని నాటకమును చూతము.

మనో.—(స్వగతము) ఇప్పుడు నా యెడలు తీఱినది. (ప్రకాశము) అట్లే. (అని విదూషకుని గొంతు కట్టి) చెడిబ్రదికిన

---

మనో.—...భట్టిణి, ణ క్ఖు అహం ఎత్థ అవరజ్ఝామి. ఏదేణ క్ఖు హదాసేణ బలాదో అలంకరణాఇం గేణ్హిఅ దువారట్ఠిదేణ ఇహ ణిరుద్ధా. మఏ అక్కందిదే వి మురఅ ణిగ్ఘోసంతరిదో ణ కేణ వి సద్దో సుదో.

వాస.—హంజే, ఉట్ఠేహి, జాణిదం సవ్వం. వసంతఓ క్ఖు ఆరణ్ణిఆవుత్తంతణాడఅసుత్తధారో.

విదూ.—సఅం ఎవ్వ చింతేహి ! కహిం ఆరణ్ణిఆ కహిం వసంతఓ ?

వాస.—మణోరమే, సుగహిదం కరిఅ ణం ఆఅచ్ఛ. పెక్ఖణీఅం సే పెక్ఖమ్హ.

శ, ఇదానీ మనుభవ ఆత్మనో దుర్నయస్య ఫలమ్'

వాఁడా, ఇప్పుడు అనుభవింపుము నీదుర్నీతికి ఫలము.

వాస.—(ససంభ్రమ ముపసృత్య) ఆర్యపుత్త్ర, ప్రతిహత మమఙ్గళమ్.

వాస.—(తొట్రుపాటుతో సమీపించి) ఆర్యపుత్త్రా, అమంగళము పోవుఁగాక.

[ఇతి పాదయో ర్నీలోత్పలదామాపనయతి. ఆర. సభయ మపసృత్య తిష్ఠతి.

[అని పాదములనుండి నల్లగలువదండను తీసివైచును. ఆర. భయముతో అవలికి జరిగి నిలుచుండును.

రాజా.—(సహసోత్థాయ విదూషకం మనోరమాంచ దృష్ట్వా, ఆత్మగతమ్) కథం విజ్ఞాతోఽస్మి!

[వైలక్ష్యం నాటయతి.

రాజు.—(తటాలున లేచి విదూషకుని మనోరమను గాంచి, ఆత్మగతము) ఏమి! తెలిసిపోయితినే!

[వెలఁగుపాటు నభినయించును.

వాస.—(సోత్ప్రాసమ్) మర్షత్వార్య పుత్త్రః. త్వం మనోర మేతి కృత్వా నీలోత్పలదామ్నా బద్ధితోఽసి.

వాస.—(ఉపహాసముతో) మన్నింపుము ఆర్యపుత్త్రా, మనోరమ వనుకొని నిన్ను నల్లగలువదండతో కట్టించితిని.

సాంకృ.—(సర్వా నవలోక్య సస్మితమ్) కథ మన్య దేవేదం ప్రేక్షణీయకం సంవృత్తమ్. అభూమి రియ మస్మద్విధానామ్. [ఇతి నిష్క్రాన్తా.

సాంకృ.—(అందఱను కని, చిఱునవ్వుతో)ఏమి! ఇది వేఱే ఆటగా పరిణమించినదే! మాబోంట్లకిది తావు గాదు.

[అని నిష్క్రమించును.

1. హతాశ...-దీనిబాహ్యార్థము, ఆరణ్యికానాటక సూత్రధారతకు దండన యనుభవింపుము, అని. ఆంతరార్థము, రాజు నటించుచున్నాఁడు లోనఁగుపాడుప్రసంగము చేసి ఆరణ్యికార్థమయిన యాపన్నాగము నెల్ల బయలుపుచ్చినందులకు ఈదండనను అనుభవింపుము, అని.

---

మనో.—...దాణిం సమస్ససిదమ్హి...తహ...హదాస దాణిం అణుహవ అత్తణో దుణ్ణఅస్స ఫలం.

వాస.—...అయ్యఉత్త, పడిహదమ మంగళం...

వాస.—...మరిసదు అయ్యఉత్తో. తుమం మణోరమేత్తి కరిఅ ణీలుప్పళదామఏణ బంధావిదోసి.

రాజా.—(ఆత్మగతమ్) అపూర్వో ఽయం కోపప్రకారః. దుర్లభమత్రానునయం పశ్యామి. (విచిన్త్య) ఏవం తావత్ కరిష్యే. (ప్రకాశమ్) దేవి, త్యజ్యతాం కోపః.

వాస.—కో ఽత్ర కుపితః ?

రాజా.-కథం న కుపితా ఽసి ?

స్నిగ్ధం య ద్యపి వీక్షితం నయన
యో స్తామ్రా తథాపి ద్యుతిః,
మాధుర్యే ఽపి సతి స్ఖల త్యనుపదం
తే గద్గదా వా గియమ్,
నిశ్వాసా నియతా అపి స్తనభరో
త్కమ్పేన సంలక్షితాః,
కోప స్తే ప్రకట ప్రసాద విధృతో
ష్యేష స్ఫుటం లక్ష్యతే.
ప్రసీద ప్రియే ప్రసీద.

వాస.—ఆరణ్యికే, త్వం కుపి

రాజు.—(ఆత్మగతము) ఈకోపవిధము అపూర్వముగా నున్నది. బుజ్జగించుట అసాధ్యముగా నగపడుచున్నది. (ఆలోచించి) కానీ ఇట్లు చేసెదను. (ప్రకాశము) దేవీ, కోపము మానుము.

వాస.—ఎవ రిట కోపగించినారు ?

రాజు.—ఏమి నీవు కోపగింపలేదా ?

నీచూపు స్నేహమును చూపుచున్నను కన్నులకాంతి యెఱ్ఱగానున్నది, నీవాక్కు మధురముగా నున్నను డగ్గుత్తికపడి ప్రతి మాటలోను తొట్రుపడుచున్నది, నిట్టూర్పులు నీ వెంత యణఁచుకొన్నను పాలిండ్లయుబుకులాటచేత తెలియనగుచున్నవి, వైయనుగ్రహముచే. నీ వెంత దాఁచినను నీకోపము స్పష్టముగా అగపడుచునే యున్నది.

మన్నింపుము ప్రియా, మన్నింపుము.

వాస.—ఆరణ్యకా, నీవు అలిగితి వని

తే వీక్షితం స్నిగ్ధం య ద్యపి = నీ చూపు స్నేహయుక్తముగా నేయున్నది గాని, తథాపి నయనయోః ద్యుతిః తామ్రా = అట్లయినను కన్నుల కాంతి ఎఱ్ఱగా (నున్నది), తే ఇయం వాక్ మాధుర్యే సతి అపి గద్గదా (సతీ) అనుపదం స్ఖలతి = నీ యీ యెలుఁగు తియ్యము గలిగియుండి యు డగ్గుత్తికపడిన దై మాటమాటలోను తొట్రిలుచున్నది, నిశ్వా...క్షితాః = నిట్టూర్పులు అణఁపఁబడినవి యయ్యును వలుదపాలిండ్లయుబుకులాటచే తెలియఁబడుచున్నవి, (ఈలింగములవలన), ఏషః తే కోపః ప్రకట...లక్ష్యతే = ఇదిగో నీ కోపము బయటి యనుగ్రహముచేత అఁపఁబడిన దయ్యును స్పష్టముగా నగపడుచున్నది. * అనుమానాలంకారము, 'ప్రతీతి ర్లిఙ్గినో లిఙ్గా దనుమాన మదూషి తాత్.'

వాస.—కో ఏత్థ కుపిదో.

తేతి ఆర్యపుత్త్రిః ప్రసాదయతి. తదుపసర్ప. [ఇతి హస్తే నాకర్షతి.

ఆర.—(సభయమ్) భట్టిని, అహం కి మపి న జానామి.

వాస.—ఆరణ్యికే, త్వం కథం న జానాసి? ఇదానీం తే శిక్షయామి. ఇన్దీవరికే, గృహ్యతా మేషా.

విదూ.—భవతి, అద్య కౌముదీ మహోత్సవే తవ చిత్త మపహర్తుం వయస్యేన ప్రేక్షణక మనుష్ఠితమ్.

వాస.-ఏతం యుష్మాకం దుర్నయం ప్రేక్ష్య హాసో మే జాయతే.

రాజా.—అల మన్యథా వికల్పనేన. పశ్య,—

భ్రూభఙ్గైః క్రియతే లలాటశశినః
కస్మాత్ కళఙ్కో౽ధునా?
వాతాకమ్పిత బన్ధుజీవసమతాం
నీతో౽ధరః కిం స్ఫురన్?

యార్యపుత్త్రునిఁడు మన్నింపు వేఁడుకొనుచున్నాఁడు,దగ్గఱకుపొమ్ము.[చేయిపట్టిలాగును

ఆర.—(భయముతో) దేవీ, నే నేమియు నెఱుంగను.

వాస.—ఆరణ్యికా, ఏమి! నీ వెఱుఁగవా? ఇదె నీకు నేర్పెదను. ఇందీవరికా, దీనిని పట్టుకొనవే.

విదూ.—అమ్మా, నేఁడు వెన్నెల మహోత్సవమని నీచిత్తము వడయుటకు వయస్యుఁడు ఆట ఆడినాఁడు.

వాస.—ఈ మీ చెనఁటిచేష్టయము గననాకు నవ్వువచ్చుచున్నది.

రాజు.—వేఱువిధముగా తలంపవలదు. కనుము,—

జాబిల్లికి ఏల యిపుడు బొమముడులతో మచ్చ కల్పించెదవు? ఏల అదురుచేత మోవిని గాలికి కరము అల్లలనాడు మంకెన పూవుసాటిం బొందించెదవు? పాలింప్లబరు

వాస.—ఆరణ్ణిఏ, తుమం కువి దె త్తి అయ్యఉత్తో పసాదేది. తా ఉవసప్ప...
ఆర.—...భట్టిణి, అహం కిం వి ణ జాణామి.
వాస.—ఆరణ్ణిఏ, తుమం కహం ణ జాణాసి? దాణిం దే సిక్ఖావేమి. ఇందీవరిఏ గెణ్హ ఏదం.
విదూ.—హోది, అజ్జ కోముదీమహూసవే తుహ చిత్తం అవహరిదుం వఅస్సేణ పెక్ఖణఅం అణుట్ఠిదం.
వాస.—ఏదం తుమ్హాణం దుణ్ణఅం పెక్ఖిఅ హాసో మే జాఅది.

మధ్య శ్చాధికకమ్పితః స్తనభరే
ణాయం పునః ఖిద్యతే,
కోపం ముఞ్చ త వైవ చిత్తహార
ణా యైవం మయా క్రీడితమ్.

వునకే ఎంతయు వణఁకుచున్నది యీకా
ను, ఇంక వేఱుగా సీయము నేల? కోపము
మానుము; నీచిత్తము నే సహయువాఁడనై
నేను ఇట్లు ఆడితిని.

దేవి, ప్రసీద ప్రసీద.

దేవి, క్షమింపు క్షమింపు.

[ఇతి పాదయోః పతతి.

[అని యడుగులలో వ్రాలును.

వాస.—హాజ్జే, నిర్వృత్తం ప్రే
క్షణికమ్. త దేహి, అభ్యన్తర మే
వ ప్రవిశావః.

వాస.—ఓసి ఆట ముగిసినది. మఱి
రా, లోనికే పోవుదము.

[ఇతి నిష్క్రాన్తః శ్రీ
వర్గో విదూషక శ్చ.

[అని శ్రీసమూహంబును విదూ
షకుండును నిష్క్రమింతురు.

రాజా.— (విలోక్య) కథ మకృ
త్త్వైవ ప్రసాదం గతా దేవీ !

రాజు.—ఏమి ! మన్నింపక దే పోయి
నది దేవి !

లలాట శశినః కస్మాత్ అధునా భ్రూ భఙ్గైః కళఙ్కః క్రియతే = ఫాల చంద్రునికి ఏల యిపుడు బొమముడులతో మచ్చ చేయఁబడుచున్నది? కిమ్ అధరః స్ఫురణ వాత ఆ కమ్పిత బన్ధుజీవ సమతాం నీతః = ఏల సెదవి యదురుచు గాలిచే ఇంచుక కదల్పఁబడిన మంకెనపూవుతోడి సాటిని పొందిపఁబడినది? (కిం) చ స్తన భరేణ అధిక కమ్పితః అయం మధ్యః (కిం) పునః ఖిద్యతె = (మఱి) యు పాలిండ్ల బరువుచేత మిక్కిలి వణఁకుచున్న యీ నడుము ఏల వెండియు గాసిలుచున్నది? కోపం ముఞ్చ, తవ చిత్త హారణాయ ఏవ మయా ఏవం క్రీడితమ్ = కోపము మానుము-నీచిత్తమును బడయుట కే నేను ఇట్లు ఆడితిని. ఇందు తొలిమూఁడుపాదములలో 'ఏల కోపించెదవు' అనుగమ్యమును అంద మైనభంగ్యంతరముచే చెప్పినందున * పర్యాయోక్తాలంకారము, 'పర్యాయోక్తం తు గమ్యస్య వచో భఙ్గ్యన్తరాశ్రయమ్.' ఇది గాళ ప్రథమపాదంబున * రూపకము, ద్వితీయమున * ఉపమ; తవైవ - ఇత్యాదివాక్యార్థము హేతుపరము గావున * కావ్యలింగాలంకారము, 'హేతో ర్వాక్యపదార్థత్వే కావ్యలిఙ్గ ముదాహృతమ్.' అంతటను కుపితాస్వరూపవర్ణనము, * స్వభావోక్త్యలంకారము, 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.'

---

వాస.—హంజే ణివ్వుత్తం పెక్ఖణఅం. తా ఏహి అబ్భంతరం ఎవ్వ పవిసహ్మ.

స్వేదామ్బుఃకణభిన్న భీషణతర
భ్రూభఙ్గ మేకం రుషా,
త్రాసే నాపర ముత్ప్లుతోత్ప్లు
తమృగీవ్యాలోల నేత్రోత్పలమ్,
ఉత్పశ్యన్నహ మగ్రతో ముఖ
మిదం దేవ్యాః ప్రియాయా స్తథా,
భీత శ్చోత్సుకమానస శ్చ
సపది క్షిప్తో మహాసంకటే.

నేను, ఎట్టయెదుట, కోపముచే చెమర్చుచు భయంకరముగా బొమలు ముడివైచియున్న దేవీముఖమును, భయముచేత ఎగిరి యెగిరి పోవుచున్న యాఁడు లేడికనుఁగలువలవలె చంచలము లయినకనుఁగలువలు గలదైన ప్రియాముఖమును, చూచుచు తత్క్షణమే భయపడినవాఁడను, ఉత్కంఠితుఁడను, అయి మహాకష్టముపాలైతిని.

త ద్యావ దిదానీం శయనీయం గత్వా దేవ్యాః ప్రసాదనోపాయం చి న్తయామి.

కావున నిపుడు పడకకుం బోయి దేవిని అలుకదీర్చు నుపాయ మరసెదను.

[ఇతి నిష్క్రాన్తాః సర్వే.

[అందఱు నిష్క్రమింతురు.

ఇతి తృతీయోఽఙ్కః.

---

అహమ్ అగ్రతః-ఇదం దేవ్యాః ముఖం తథా ఇదం ప్రియాయాః ముఖమ్ = నేను ఎదుట-ఈ దేవీ(వాస.)ముఖమును అట్లే ఈ ప్రియా(ఆర.)ముఖమును, రుషా స్వేద అమ్బుః కణ భిన్న భీషణతర భ్రూభఙ్గమ్ ఏకమ్ = కోపముచేత చెమట నీటి బొట్టులతో మిశ్రమును మిగులభయంకరములయిన బొమముడులు గలదియు అగుదానిని ఒకటిని(దేవీముఖమును), త్రాసేన ఉత్ప్లుత ఉత్ప్లుత మృగీ వ్యాలోల నేత్ర ఉత్పలమ్ అపరమ్ = భయముచే ఎగిరి యెగిరి పోవుచున్న పెంటిలేడి(యొక్క-కనుగలువల)వలె చంచలములైన కనుగలువలుగలదానిని రెండవదానిని (ప్రియాముఖమును), ఉత్పశ్యన్ సపది భీతః చ ఉత్సుక మానసః చ మహా సంకటే క్షిప్తః =కనుచు తత్క్షణమే వెఱచినవాఁడను కోర్కెగల మనస్సుగలవాఁడను (అయి) గొప్ప యిబ్బందిలోనికి త్రోయఁబడితిని. ఏకమ్,రుషా, దేవ్యాః భీతః, అని—అపరమ్, త్రాసేన, ప్రియాయాః, ఉత్సుకమానసః, అనియు—క్రమాన్వయము గావున * యథాసంఖ్యాలంకారము, 'యథాసంఖ్యం క్రమే ణైవ క్రమికాణాం సమన్వయః.' పూర్వార్ధమందు * స్వభావోక్తియు; మృగీ...లమ్ * ఉపమ.

## [1] ప్రవేశకః.

---

¹ (తతః ప్రవిశతి మనోరమా.)

² మనో.—(సోద్వేగమ్) అహో! దీర్ఘరోషతా దేవ్యాః! ఏతావన్తం కాలం బద్ధాయా అపి ప్రియసఖ్యా ఆరణ్యికాయా ఉపర్యనుగ్రహం న గృహ్ణాతి! (సాస్రమ్) సా తపస్వినీ ఆత్మనో బన్ధనస్య కృతే న తథా సంతప్యతే యథా భర్తుర్దర్శననిరాశతయా. ఈదృశం చాస్యా దుఃఖం యేనాద్యైవాత్మానం వ్యాపాదయన్తీ మయా కథమపి నివారితా. ఏతం వృత్తాన్తం భర్తుర్నివేదయేతి వసన్తకం భణిత్వా ఆగతాస్మి.

(అంతట మనోరమ ప్రవేశించును.)

మనో.—(భయముతో) అయ్యో! ఎంత దీర్ఘకోపము దేవికి! ఇంత కాలము చెఱలో ఉంచియు (నా) యనుంగుం జెలియారణ్యిక మీఁద కరుణ చాల్ప దాయెను! (కన్నీళ్లతో) ఆదీనురాలు రాజు నిఁక చూడ నను నిరాశచేత వగరుచున్నంత తన చెఱకై యింత వగరుట లేదు. ఆమెయొక్క వగ యెట్టి దనఁగా దానిచేత ఇప్పుడే ప్రాణము త్యజింప నుండఁగా ఎట్టకేలకు నేను నివారించితిని. ఈవృత్తాంతమును ప్రభువునకుం దెలుపు మని వసంతకునితో చెప్పి వచ్చుచున్నాను.

1. 'ప్రవేశకోఽనుదాత్తోక్త్యా నీచపాత్రప్రయోజితః
అఙ్కద్వయాన్తర్విజ్ఞేయః శేషం విష్కమ్భకే యథా.' సా. ద.
ప్రవేశకము అనుదాత్తోక్తిచే నీచపాత్రములచే ప్రయోగింపఁబడును, రెండంకములకు నడుమనుండును, మిగత విష్కంభమునం బోలె.

2. కాలమ్ - అత్యన్తసంయోగే ద్వితీయా. 'మునిదీనౌ తపస్వినౌ' అమ. కథమపి—'కథమాది తథాప్యన్తం యత్నగౌరవ బాఢయోః.' వ్యాపాదయన్తీ—'వ్యాపాదో ద్రోహచిన్తనమ్.' అమ.

---

మనో.—...అహో దీహరోసదా దేవీఏ! ఎత్తిఅం కాలం బద్ధాఏ వి ఆరణ్ణిఆఏ ఉవరి అణుగ్గహం ణ గెణ్హాది!...సా తవస్సిణీ అత్తణో బంధణస్స కిదే ణ తహా సంతప్పది, జహా భట్టిణో దంసణణిరాసదాఏ. ఈరిసం అ సే దుక్ఖం, జేణ అత్తాణం వావాదఅంతీ మఏ కహం వి ణివారిదా. ఏదం ఉత్తంతం భట్టిణో ణివేదేహి త్తి వసంతఅం భణిఅ ఆఅదమ్హి.

(తతః ప్రవిశతి కాఞ్చనమాలా.)

కాఞ్చ.— కథ మన్వేషయ న్త్యాపి మయా భగవతీ సాంకృత్యాయనీ న దృష్టా (విలోక్య) త దేతా మపి తావన్మనోరమాం ప్రక్ష్యామి. (ఉపసృత్య) మనోరమె [1] అపి జానాసి కుత్ర భగవతీ సాంకృత్యాయనీతి.

(అంతట కాంచనమాల ప్రవేశించును.)

కాంచ.—ఏమి ! ఎంత వెదకియు నేను భగవతిని సాంకృత్యాయనిని కానవైతిని. (చూచి) కావున ఈమనోరమను గూడ అడిగెదను. (సమీపించి) మనోరమా, ఎఱుఁగుదువా భగవతి సాంకృత్యాయని యెచట నున్నదో ?

మనో.— (విలోక్య, అశ్రూణి ప్రమృజ్య) హలా, కాఞ్చనమాలె, దృష్టయా తయా కిం ప్రయోజనమ్.

మనో.—(చూచి, కన్నీళ్లు తుడుచుకొని,) ఓసి కాంచనమాలా, ఆమెను చూడ వలసిన పనియేమి ?

కాఞ్చ.—మనోరమే, అద్య దేవ్యా అఙ్గారవత్యా లేఖోఽను[2] ప్రేషితః. తస్మిన్ వాచితే బాష్పపూర్ణనయనా ధృఢం సంతపితు మారబ్ధా దేవీ. తత్ వినోదన నిమిత్తం తస్యాః భగవతీ మన్వేషయామి.

కాంచ.—మనోరమా, నేఁడు అంగారవతీదేవియొద్దనుండి జాబు వచ్చినది. దానిని చదువుకొని కన్నీళ్లు నింపుకొని మిక్కుటముగా వగవఁదొడంగినది దేవి. కావున ఆమెను ఓదార్చుటకొఱకు భగవతిని వెదకుచున్నాను.

1. అపి జానాసి—అపి ప్రశ్నే, 'గర్హా సముచ్చయ ప్రశ్న శఙ్కా సంభావనా స్వపి.' అమ.

2. అనుప్రేషితః = పంపఁబడినది. తస్మిన్ వాచితే = అది చదువఁబడఁగా.

---

కాఞ్చ.—కహం అణ్ణేసంతీఏ వి మఏ భఅవదీ సంకిచ్చాఅణీ ణ దిట్టా... తా ఏదం వి దావ మణోరమం పుచ్ఛిస్సం... మణోరమే అవి జాణాసి కహిం భఅవదీ సంకిచ్చాఅణి త్తి ?

మనో.—...హలా కంచణమాలే, దిట్టాఏ తాఏ కిం పఓఅణం ?

కాఞ్చ.—మణోరమే, అజ్జ దేవీఏ అంగారవదీఏ లేహో అణుప్పేసిదో. తస్సిం వాఇదే బాహపుణ్ణణఅణా దిఢం సంతప్పిదుం ఆరద్ధా దేవీ. తా విణోదణ ణిమిత్తం తాఏ భఅవదిం అణ్ణేసామి.

మనో.—హాలా, కిం పున స్త స్మిన్ లేఖే ఆలిఖితమ్ ?

మనో.—ఓసీ, మఱి ఆజాబులో ఏమి వ్రాయఁబడియున్నది ?

కాఞ్చ.—'యా మమ భగినీ సా తవ జనన్యేవ, తస్యా భర్తా దృఢవర్మా తాత స్తే. తత్ తవ కి మా చష్టవ్యమ్ ? తస్య సమధికం సంవత్సరం[1] కళిఙ్గహతకేన బద్ధస్య. త న్న యుక్త మేతం వృత్తాన్త మనాచక్ష్య సమీపస్థితాయ సమర్థాయ భర్త్రే తవోదాసీనత్వ మవలమ్బితు మి'తి.

కాంచ.—'ఎవతె నాకు తోఁబుట్టువో ఆమె నెనిమిటి దృఢవర్మ నీకు తండ్రి. కాన నీకు చెప్పవలయునా ? ఆయన పాదలికళింగునిచేత చెఱలో నుంపఁబడి సంవత్సరమున కెక్కువ అయినది. కావున, ఈ వృత్తాంతమును చెంత నున్న సమర్థునికి నీభర్తకు నీవు తెలుపక ఒప్పరికించుట తగదు.' అని.

మనో.—హాలా, కాఞ్చనమాలే, యత స్తావ దయం వృత్తాన్తో భట్టిన్యై న కే నాపి విజ్ఞాపయితవ్య ఇతి భర్త్రా ఆజ్ఞప్తం, త త్కేన పునరిదానీం స లేఖః శ్రావితః ?

మనో.—చెలీ, కాంచనమాలా, ఈవృత్తాంతమును ఎవ్వరును దేవికి విన్నవింపవల దని ప్రభువు ఆజ్ఞాపించియుండఁగా ఎవ రిపుడు ఆజాబును (చదివి) వినిపించిరి ?

కాఞ్చ.—అనువాచ్య తూష్ణీం

కాంచ.—చదువుకొని ఊరకయున్న

1. కళిఙ్గ హతకః—హతక శ్చాసౌ కళింగ శ్చేతి 'కుత్సితాని కుత్సనై'రితి హతక శబ్దస్య పరనిపాతః, హతకుఁ డనుట తిట్టు. భర్త్రే అనా చక్ష్య—క్రియయా య మ మభి ప్రైతీతి స సంప్రదాన మితి చతుర్థీ.

---

మనో.—హలా కిం తస్సిం లేహె ఆలిహిదం ?

కాఞ్చ.—జా మహ భఇణీ సా తవ జణణీ ఎవ్వ. తాఏ భత్తా దిఢవమ్మా తాదో దే. తా తవ కిం ఏదం ఆచక్ఖిదవ్వం ? తస్స సమధిఅం సంవచ్ఛరం కళింగహదఏణ బద్ధస్స; తా ణ జుత్తం ఏదం వుత్తంతం అణాచక్ఖిఅ సమీవట్ఠిదస్స సమత్థస్స భత్తుణో దే ఎవ్వం ఉదాసీణత్తణం ఓలంబిదుం తి.

మనో.—హలా కంచణమాలే, జదో దావ అఅం వుత్తంతో భట్టిణీఏ ణ కేణ వి విణ్ణావఇదవ్వో త్తి భట్టిణా ఆణత్తం, తా కేణ ఉణ దాణిం సో లేహో సుణావిదో ?

భూతాయా మమ హస్తా ద్గృహీత్వా స్వయం దేవ్యా వాచితః.

నాచేతినుండి కైకొని దేవి తానే చదువుకొన్నది.

మనో.—తేన గచ్ఛ త్వమ్; ఏషా ఖలు దేవీ తత్రైవ సహ దన్తవలభ్యాం తిష్ఠతి.

మనో.—అటయిన నీవు పో. ఇదిగో దేవి ఆమెతోనే దంతపుమేడయందున్నది.

కాఞ్చ.—తత్ భట్టినీసకాశం గమిష్యామి. [ఇతి నిష్క్రాన్తా.

[కాంచ.—కావున, దేవికడ కేఁగెదను. [అని నిష్క్రమించును.

మనో.—చిరం ఖలు మ మారణ్యకాసకాశా దాగతాయాః. దృఢం ఖలు నిర్విణ్ణా సా తపస్వినీ ఆత్మనో జీవితేన. కదాపి అత్యాహితం భవేత్. తత్ తత్రైవ గచ్ఛామి. [ఇతి నిష్క్రాన్తా.

మనో.—నేను ఆరణ్యికకడనుండి వచ్చి చాలసేపు అయినది. పాపము! అది తన ప్రాణమీఁద మిక్కిలి విసిగిపోయినది. ఒకవేళ గొప్పచెట్ట కలిగినను కలుగును కాన నటకే పోయెదను. [అని నిష్క్రమించును.

ఇతి ప్రవేశకః.

---

కాఞ్చ.—అణువాఇఅ తుణ్హింభూదాఏ మమ హత్థాదో గేణ్హిఅ సఅం దేవీఏ వాఇదో.

మనో.—తేణ గచ్ఛ తుమం. ఏసా క్ఖు దేవీ తాఏ ఎవ్వ సహ దంతవలభీఏ చిట్ఠఇ.

కాఞ్చ.—తా భట్టిణీసఆసం గమిస్సం.

మనో.—చిగం క్ఖు, మే ఆరణ్ణిఆసఆసాదో ఆఅదాఏ. దిఢం ణివ్విణ్ణా సా తవస్సిణీ అత్తణో జీవిదేణ; కదావి అచ్చాహిదం భవే. తా తహిం ఎవ్వ గచ్ఛమ్హి.

# చతుర్థోఽఙ్కః.

(తతః ప్రవిశతి సోద్వేగా ఆసనస్థా వాసవదత్తా, సాంకృత్యాయనీ, విభవతశ్చ పరివారః.)

(అంతట దుఃఖాక్రాంతురాలై ఆసనస్థ వాసవదత్తయు, సాంకృత్యాయనియు విభవంబుగా పరివారమును ప్రవే.)

సాంకృ.—రాజపుత్రి, అల ముద్వేగేన, నేదృశో వత్సరాజః, కథ మిత్థంగత మపి భవత్యా మాతృష్వస్రుపతిం విజ్ఞాయ వత్సరాజో నిశ్చిన్తః స్థాస్యతి ?

సాంకృ.—రాజకుమారీ, దిగులుపడ వలదు, ఇట్టివాఁడు కాఁడు వత్సరాజు, నీతల్లితోఁబుట్టువుపెనిమిటి యిటు(వంటి యిడుమపా) లయినాఁ డని యెఱిఁగి వత్సరాజు నిశ్చింతగా నుండునా ?

వాస.— (సాస్రమ్) భగవతి, అతి ఋజుకా ఇదానీం త్వమ్; యస్య మయా న కార్యం, తస్య మదీయేన జనేన కిం కార్యమ్ ? అర్జుకాయా యుక్త మమైత దాలిఖితుమ్. నా పున ర్జానాతి అద్యాపి తాదృశ్యేవ వాసవదత్తేతి. తవ పున రేష ఆరణ్యకావృత్తాన్తః ప్రత్యక్షః. తత్కథ మేత ద్భణసి ?

వాస.—(కన్నీళ్లతో) భగవతి, నీవు ఇపుడు మిక్కిలి తిన్ననిదానవు; ఎవనికి నాతో పనిలేదో అతనికి నావారితో నేమి పని ? అమ్మకు తగును నా కట్టుబ్రాయుట. ఏల యన-ఆమె ఇప్పటికిని వాసవదత్త మును పటివంటిదే అని తలఁచుకొనియున్నది. నీకైనను ఈయరణ్యకావృత్తాంతము ప్రత్యక్షము. మఱి నీవును ఇట్లు చెప్పుదు వేమి ?

సాంకృ.—యత ఏవ మే ప్రత్యక్షః, మత ఏవ బ్రవీమి; తేన నను కౌముదీ మహోత్సవే త్వాం హాసితుం తథా క్రీడితమ్.

సాంకృ.—నాకు ప్రత్యక్షమయిన కారణముననే పలికెదను. ఆయన నిశ్చయముగా కౌముదీమహోత్సవములో నిన్ను నవ్వించుటకు అట్లు ఆడినాఁడు.

---

వాస.—...భఅవది అదిఉజ్జుఆ దాణిం తుమం. జస్స మఏ ణ కజ్జం తస్స మమకేరఏణ జణేణ కిం కజ్జం ? అజ్జుఆఏ తు జుత్తం మమ ఏదం ఆలిహిదుం. సా ఉణ జాణాది అజ్జ వి తాదిసీ ఎవ్వ వాసవదత్తె త్తి. తుహ ఉణ ఏదం ఆరణ్ణిఅవుత్తంతం పచ్చక్ఖం; తా కహం ఏదం భణాసి?

వాస.—భగవతి, ఇత్థం సత్యం హాసితాస్మి యేన భగవత్యాః పురతో లజ్జయా కథ మపి తిష్ఠామి. త త్కిం తదీయయా కథయా? ఏ తె నైవ పక్షపాతే నైతావతీం భూమిం నీతాస్మి. [ఇతి రోదితి.

వాస.—భగవతీ, ఇట్లు నిజముగా నవ్వింపఁబడితిని, కావున నే భగవతియెదుట లజ్జచేత ఎట్టకేలకు ఉన్నదానను. ఏల ఆవిషయముంగూర్చినమాటలు? ఈపక్షపాతముచేత నే ఇట్టి దశకు తేఁబడితిని.

[అని యేడ్చును

సాంకృ.—రాజపుత్రి, అలం రుదితేన; నేదృశో వత్సరాజః. (విలోక్య) అథవా ప్రాప్త ఏ వాయం వత్సరాజః, య స్తే మన్యుప్రమార్జనం కరోతి.

సాంకృ. — రాజపుత్రీ, ఏడువకు; వత్సరాజు ఇట్టివాఁడుకాఁడు. (చూచి) పోనీ, నామాట లేల? రానే వచ్చినాఁడు నీ శోకముం దీర్చువాఁడు వత్సరాజు.

వాస.—మనోరథా ఏ తే భగవత్యాః.

వాస.—ఇవి భగవతి కోరికలు.

(తతః ప్రవిశతి రాజా, విదూషక శ్చ.)

(అంతట రాజు విదూషకుఁడునుప్రవే.)

రాజా.—క ఇ వాభ్యుపాయః ప్రియాం మోచయితుమ్?

రాజు.—ఏమి యుపాయము ప్రియను విడిపించుటకు?

విదూ.—భో వయస్య, ముఞ్చ విషాదమ్. అహం తే ఉపాయం కథయిష్యామి.

విదూ.—వయస్యుఁడా, వగవకు; నేను నీకు ఉపాయము చెప్పెదను.

రాజా.—(సహర్షమ్) వయస్య, త్వరిత మభిధీయతామ్.

రాజా.—వయస్యా, త్వరగా చెప్పవోయి.

---

వాస.—భఅవది, ఎ త్త సచ్చం హాసిదమ్హి, జేణ భఅవదీఏ పురదో లజ్జాఏ కహాఏ వి చిట్ఠామి. తా కిం తక్కేరకాఏ కహాఏ? ఏదేణ ఎవ్వ పక్ఖవాదేణ ఎత్తిఅం భూమిం ణీదమ్హి.

వాస.—మణోరహా దాణిం ఏదే భఅవదీఏ.

విదూ.—భో వఅస్స ముంచ విసాదం. అహం దే ఉవాఅం కహాఇస్సం.

విదూ.—భో స్త్వం తావ ద నేక సమర సంఘట్ట ప్రహారాఙ్కిత బాహు సాలః; పున రపి అనేక గజ తురగ పదాతి దుర్విషహ బల సముదితః. త త్సర్వబలసందోహేన అన్తఃపురం సంపీడితం కృత్వా ఇదానీ మే వారణ్యికాం మోచయ.

విదూ.—ఓయి, నీ వయిసనో సెక్కుపో రులయొుద్ధములలో తిన్న దెబ్బల మచ్చలతో డబుబుము(స్టుంగనులవాండవు; పయిగా, గజతురగపదాతుల బెట్టిదంపుగాయువతో తేమవాండవు. కావున సమస్త సైన్య సంఘాతముతో అంతఃపురమునను ముట్టడి వైచి ఇప్పుడే ఆరణ్యికను విడిపింపుము.

రాజా.—వయస్య, అశక్య ముపదిష్టమ్.

రాజు.—వయస్యా, అసాధ్యము నుపదేశించితివి.

విదూ.—కి మ త్రాశక్యమ్? యతః కుబ్జ వామన ముగ్ధ స్థవిర కఞ్చుకి వర్జం మనుష్యోఽపరో నాస్తి తత్ర.

విదూ.—ఇందు అసాధ్య మే మున్నది? ఏల యన, అచట గుజ్జు కుఱుచ వెంగలి ముదుక యంగజాలలు దప్ప వేఱునరుండు లేండు.

రాజా.—(సావజ్ఞమ్) కి మసంబద్ధం ప్రలపసి? దేవ్యాః ప్రసాదం ముక్త్వా నాన్యోఽ స్త్యస్యా మోక్షోపాయః. తత్ కథయ కథం దేవీం ప్రసాదయామి.

రాజు.—(తిరస్కారముతో) ఏమి అసంగతములు ప్రేలం జొచ్చితివి? దేవిగారుకృయనుగ్రహము తప్ప ఈప్రియను విడిపింప ఒండు ఉపాయము లేదు. కనుక ఎట్లు దేవిని అనుగ్రహింపంజేయనగునో చెప్పుము.

విదూ.—భో మాసోపవాసం కృత్వా జీవితం ధారయ, య ద్యే

విదూ.—ఓయి ప్రాణాలు బిగంబట్టుకొని ఒకనెల యుపవాస ముండు, అంతట దేవి

విదూ.—భో తుమం దావ అణేఅసమరసంఘట్టప్పహారంకిద బాహుసాళో పుణో వి అణేఅగఅతురఅపదాఇదువ్విసహబలసముదిదో. తా సవ్వబలసందోహేణ అంతేఉరం సంపీడిఅం కరిఅ దాణిం ఎవ్వ ఆరణ్ణిఅం ముంచావేహి.

విదూ.—కిం ఎత్థ అసక్కం? జదో కుజ్జవామణముద్ధథేరకంచుఇవజ్జిదో మణుస్సో అవరో ణత్థి తహిం.

వం దేవీ చణ్డీ ప్రసత్స్యతి.

రాజా.—(విహస్య) అలం పరిహాసేన. కథం కథయ దేవీం ప్రసాదయిష్యామి.

ధృష్టః కిం పురతోఽవరుధ్య విహసన్ గృహ్ణామి కణ్ఠే ప్రియాం?

కిం వా చాటుశతప్రపఞ్చరచనాప్రీతాం కరిష్యామి తామ్?

కిం తిష్ఠామి కృతాఞ్జలి ర్నిపతితో దేవ్యాః పునః పాదయోః?

సత్యం సత్య మహో న వేద్మ్యనునయ స్తస్యాః కథం స్యా దితి.

త దేహి దేవీసకాశ మేవ గచ్ఛావః.

విదూ.—భో గచ్ఛ త్వమ్. అహం పున ర్బన్ధనా త్కథ మపి

చండి గదా ప్రసన్నయగును.

రాజు.—(నవ్వి) ఎకసక్కెమును నిలుపు. దేవిని ఎట్లు అలుక దీర్తునో చెప్పు.

దిట్టతనము వహించి యెదుట అడ్డపడి నవ్వుచు ప్రియను కంఠమున కౌఁగిలింతునా? ఒండె, బుజ్జవంపుమాటలు మెండుగా విస్తరముగా పలికి ప్రసన్నను జేయుదునా? (ఒండె) మఱల తత్పాదముల వ్రాలి కేల్మోడ్చుకొని నిలుచుందునా? అహో దేవికి అలుక యెట్లు తీఱునో ఎఱుఁగను. ఈమాట నిజము నిజము.

కావున రా దేవికడ కే పోవుదము.

విదూ.—అయ్యా, నీవు పో. నే నేమో చెఱనుండి ఎట్లో తప్పి వచ్చితిని. కనుక

ధృష్టః (సన్) పురతః అవరుధ్య విహసన్ ప్రియాం కణ్ఠే గృహ్ణామి కిమ్=దిట్టరి (నై) ఎదుట అడ్డగించి నవ్వుచు దయితను మెడయందు కవుఁగిలింతునా, (అథ) వా తాం చాటు శతప్రపఞ్చ రచనా ప్రీతాం కరిష్యామి కిమ్=అట్లుగాదేని అక్కాంతను బుజ్జవంపుమాటల వందల విస్తరముయొక్క యల్లికచే సంతుష్టనుగా చేయుదునా, దేవ్యాః పాదయోః పునః నిపత్య కృత అఞ్జలిః తిష్ఠామి కిమ్ = దేవియడుగులందు వెండియు వ్రాలి చేయఁబడిన యంజలిగలవాఁడనై (కేల్మోడ్చి) నిలుతునా, అహో తస్యాః అనునయః కథం స్యాత్ ఇతి న వేద్మి సత్యం సత్యమ్ = అహో దేవికి సాంత్వనము ఎట్లు అగునో అది ఎఱుఁగను నిజము నిజము.

---

విదూ.—భో మాసోపవాసం కరిఅ జీవిదం ధారేహి. జది ఎవ్వం దేవీ చండీ పసీదిస్సది.

విదూ.—భో గచ్ఛ తుమం. అహం ఉణ దాణిం ఎవ్వ బంధణాదో కహం వి పరిబ్భంసిఅ ఆఅదో. తా గమిస్సం.

పరిభ్ర శ్శ్యాగతః. త ద్గమిష్యామి.

(ఇంటికి) పోయెదను.

రాజా.—(విహస్య, కణ్ఠే గృహీత్వా, బలా న్నివర్త్య) మూర్ఖ, ఆగమ్యతామ్. (పరిక్ర మ్యావలోక్య చ) ఇయం దేవీ ద న్తవలభీ మధ్యా స్తే. యావ దుపసర్పామి. [సలజ్జ ముపసర్పతి.

[వాస. ఆసనా దు త్తిష్ఠతి.

రాజా.—(నవ్వి, మెడ పట్టుకొని బలిమి మెయి మఱలించి) రావోయి మూర్ఖుఁడా. (నడచి, చూచి యు) ఇదిగో దేవి దంతవలభియందు కూర్చున్నది. సమీపించెదను. [లజ్జించుచు సమీపించును.

[వాస. ఆసనమునుండి లేచును.

రాజా.—

[1] కిం ముక్త మాసన? మలం
మయి సంభ్రమేణ;
నోత్థాతు మిత్థ ముచితం
మమ తా న్తమధ్యే;
దృష్టి ప్రసాదవిధి మాత్ర
హృతోజ నోఽయ
మత్యాదరేణ కి మితి
క్రియతే. విలక్షః?

రాజా.—

ఏల యాసనమును వదలెదవు? నాయెడల (ఈ) తొట్రుపాటేల? డస్సిన నడుముగలదానా, నాకై యిట్లు లేచుట సరిగాదు; చూడ్కిని దయచేసిన మాత్రాన వశ్యుఁ డయ్యెడి యీ జనుని అత్యాదరముచేత ఏల వెలఁగుపఱిచెదవు.

[2] వాస.—(ముఖం నిరూప్య) విలక్ష ఇదానీం త్వ మసి.

వాస.—(ముఖముం గాంచి) ఇపుడు నీవు వెలఁగుపడిన వాఁడవే అయితివి.

1. తా న్త మధ్యే = డస్సిన కవునుగలదానా, ఆసనమ్ కిమ్ ముక్తమ్ = ఆసనము ఏల వదలఁబడినది, మయి సంభ్రమేణ అలమ్ = నావిషయమై తొట్రుపాటు వలదు, మమ ఇత్థమ్ ఉత్థాతుమ్ ఉచితం న = నాకొఱకు ఇట్లు లేచుట తగినది కాదు, దృష్టి ప్రసాద విధి మాత్ర హృతః అయం జనః కిమ్ ఇతి అత్యాదరేణ విలక్షః క్రియతే = చూపుయొక్క అనుగ్రహముయొక్క చేయుట మాత్రముచేత లోఁగొనఁబడెడి యీ జనుఁడు ఏ మని అధిక గౌరవముచేత విలక్షుఁడుగా చేయఁబడుచున్నాఁడు. తా న్త మధ్యే—హేతుగర్భము, * కావ్యలింగాలంకారము. ఉత్తరార్ధమున * విషమాలంకారము, 'విషమం వర్ణ్యతే యత్ర ఘటనా ఽ ననురూపయోః.'

2. శఠుఁడవు నీవు, నీకెక్కడి వెలఁగు? అని భా.

వాస.—...విలక్షో దాణిం తుమం హోసి.

రాజా.—ప్రియే సత్యమహం విలక్షః, యత్ప్రత్యక్షదృష్టాపరాధో భవతీం ప్రసాదయితు మిచ్ఛామి.

సాంకృ.—(ఆసనం నిర్దిశ్య) క్రియతా మాసనపరిగ్రహః.

రాజా.—(ఆసనం నిర్దిశ్య) ఇత ఇతో దే వ్యుపవిశతు.

[వాస. భూమా వుపవిశతి.

రాజా.—ఆః కథం భూమా వుపవిష్టా దేవీ! అహ మప్యత్రై వోపవిశామి. (ఇతి భూమా వుపవిశ్య) ప్రియే, ప్రసీద ప్రసీద. కి మేవం ప్రణతేఽపి మయి గభీరతరం కోప ముద్వహసి?

భ్రూభఙ్గం న కరోషి, రోదిషి ముహు ర్ముగ్ధేక్షణే, కేవలం;
నాసి ప్రస్ఫురితాధరాఽనవరతం నిశ్వాస మే వోజ్ఝసి;
వాచం నాపి జహాసి, తిష్ఠసి పరం ప్రధ్యానసమ్మీలనా;
కోప స్తే నిభృతోఽతి పీడయతి మాం గూఢప్రహారోపమః.

రాజు.—ప్రియా, నిజముగా నేను విలక్షుఁడనే, ఏల యన (నా) తప్పు ప్రత్యక్షముగా కనఁబడినను, నిన్ను అనుగ్రహము వేఁడ వచ్చినాఁడను.

సాంకృ.—(ఆసనముం జూపి) ఆసనమును అంగీకరింపఁదగును.

రాజు.—(ఆసనముం జూపి) ఇట ఇట, దేవి కూర్చుండవలయును.

[వాస. నేలఁ గూర్చుండును.

రాజు.—అయ్యో! ఏమి నేలఁగూర్చున్నదే దేవి! నేనును ఇటనే గూర్చుండెదను. (అని నేలఁ గూర్చుండి) ప్రియా, కరుణింపు కరుణింపు. ఏమి! ప్రణతుఁడ నైనను నామీఁద నిట్లు లోలోపల రోసము దాల్చియున్నావు?

ఓవామలోచనా, బొమలు ముడివేయవుగాని, మాటిమాటికి ఏడువను మాత్రమేడ్చెదవు; మోవి యదురుట లేదు గాని సదా నిట్టూర్పులను నిగుడ్చుచునే యున్నావు; మాట మానవుగాని, ఏమో ఆలోచనతో నెమ్మోము వాంచి యున్నావు; నీ గూఢకోపము పై కగపడనియుపఘాతము వలె నన్ను కరము నొగిలించుచున్నది.

ముగ్ధేక్షణే—ముగ్ధ = సుందరమయిన - ఈక్షణే = నేత్రములుగలదానా, భ్రూభఙ్గం న కరోషి = బొమముడి సేయవు (గాని), ముహుః కేవలం రోదిషి = మాటిమాటికి ఏడువను మాత్రమేడ్చెదవు; ప్రస్ఫురిత అధరా న అసి=ప్రకటమైన యదురు

ప్రసీద ప్రియే ప్రసీద.

[ఇతి పాదయోః పతతి.

వాస.—అతిసుఖిత ఇదానీమసి. కస్మాద్దుఃఖితం జనం వికారయసి? ఉత్తిష్ఠోత్తిష్ఠ. కోఽత్ర కుపితః?

సాంకృ.—ఉత్తిష్ఠ మహారాజ కిమనేన? అన్య దేవ తావదుద్వేగకారణ మస్యాః.

రాజా.—(ససంభ్రమమ్) భగవతి, కిమన్యత్?

[సాంకృ. కర్ణే కథయతి.

రాజా.—(విహస్య) యద్యేవమల ముద్వేగేన. మయాపి జ్ఞాతమ్. సిద్ధ ఏవాస్మిన్ ప్రయోజనే దేవీం వర్ధయిష్యామీతి నోక్తమ్. అన్యథా కథ మహం దృఢవర్మవృత్తాన్తే విస్రబ్ధస్తిష్ఠామి? తత్కతిపయాన్యహాని తద్వార్తాయా ఆగతాయాః! ఇదం చ తత్ర వర్తతే.

ప్రియా కరుణింపు కరుణింపు.

[అని పాదముల వ్రాలును.

వాస.—నీ విప్పుడు అతిసుఖమున నున్నాఁడవు. ఏల దుఃఖమునం బడియున్న వానిని వెక్కిరించెదవు? లే లెమ్ము. ఎవరిక్కడ కోపించినారు?

సాంకృ.—లెమ్ము, మహారాజా, ఈతోలి యేల? ఈవగపునకు కారణము వేఱే.

రాజు.—(ఆనలపాటుతో) భగవతీ, మఱి యేది?

[సాంకృ. చెవిలో చెప్పును.

రాజు.—(నవ్వి) అటులేని వగవ నక్కఱలేదు. నాకును తెలిసినది, అయినను నాప్రయోజన మెప్పు డౌనో యప్పుడు దేవిని అభినందింప నెంచి ఇపుడు చెప్పకుంటిని. అంతియగాని నేను దృఢవర్మవిషయమున అక్కఱలేనివాఁడ నై యుందునా? అచటి వార్త వచ్చి కొంచము దినములే అయినవి. అప్పటిస్థితి యిది.

తోడి మోవిగలదానవు కావు, (అయినను), అనవరతం నిశ్వాసమ్ ఉజ్ఝసి ఏవ = సదా నిట్టూర్పు నిగుడ్చుచునే యున్నావు; అపి (చ) వాచం న జల్పసి = మఱి (యు) మాటను మానవు, పరం ప్రధ్యాన నమ్ర ఆననా తిష్ఠసి = కాని ప్రకృష్టమయిన చింతచేత వంగిన వదనముగలదానవై యున్నావు; నిభృతః తే కోపః గూఢప్రహార ఉపమః మామ్ అతి పీడయతి = గూఢమైన నీకోపము వెలికి కనఁబడని యభిఘాతము సాటిగాఁగలదై నన్ను మిగుల నొగిలించుచున్నది. * ఉపమాలంకారము.

---

వాస.—అదిసుహిదో దాణిం సి. కీస దాణిం దుక్ఖిదం జణం విఆరేసి? ఉట్ఠేహి ఉట్ఠేహి. కో ఎత్థ కువిదో?

అస్మద్బలై ర్విజయసేన పురస్సరై
స్తై
రాక్రాన్తబాహ్యవిషయో విహత
ప్రతాపః
దుర్గం కళిఙ్గహతకః సహసా ప్రవిశ్య
ప్రాకారమాత్రశరణః కిల
వర్తతే౽సౌ.

విజయసేనుఁడు నడపిన యీ మన సేనలు ఆపాడుకళింగుని (కోటకు) బయటిదేశమును పట్టుకొని వాని ప్రతాపమును హతమార్చినంతటఁ, వాఁడు తటాలున దుర్గము సొచ్చి ప్రాకారమాత్రమే రక్షకముగా నున్నాఁడు.

తదవస్థం చ తమ్,

ఆదశలో నున్న యాతనిని,

[2] నిర్దిష్టాక్రాన్తిమన్దం ప్రతిదినవిరమ
ద్వీరదాసేరబృన్దం
శశ్వత్సంశీర్యమాణద్విపతురగవరం
క్షీణనిశ్శేషసైన్యమ్
అద్య శ్వో వా విభగ్నే ఝడితి మ
మ బలైః సర్వత స్తత్ర దుర్గే
బద్ధం యుద్ధే హతం వా భగవతి నచి
రాచ్ఛ్రోష్యసి త్వం కళిఙ్గమ్.

భగవతీ, పైఁజెప్పినట్లు తనబయటిదేశము పట్టినందున దుర్బలుఁడై యున్న యాకళింగునియొక్క వీరభృత్యసముదాయమును దినదినము రూపుమాపి మంచిమంచియేనుఁగులను గుఱ్ఱములను సర్వదా కూల్చి సైనికుల నందఱను తెగటార్చి, నేఁడో రేపో మనసేనలు ఆదుర్గమును క్షణములో పడఁగొట్టి వానిని బందిచేసిన వనియో యుద్ధములో పరిమార్చిన వనియో వార్తను త్వరలో నీవు వినెదవు.

1. అసౌ కళిఙ్గహతకః = ఈ పాడుకళింగుఁడు, విజయసేన పురస్సరైః తైః అస్మత్ బలైః = విజయసేనుఁడు ముందునడచువాఁడు (నాయకుఁడు) గాఁగల యీమన సేనలచేత, ఆక్రాన్త బాహ్య విషయః విహత ప్రతాపః (సన్) = పట్టఁబడిన బయటిదేశముగలవాఁడును కొట్టఁబడిన పరాక్రమముకలవాఁడును (ఐ), సహసా దుర్గం ప్రవిశ్య=తటాలున దుర్గము సొచ్చి, ప్రాకార మాత్ర శరణః వర్తతే కిల = ప్రహరి మాత్రమే రక్షకముగాఁగలవాఁడుగా నున్నాఁడు సుమా.

2. కళిఙ్గమ్ = కళింగుఁడు [ఆంధ్రవ్యవహారోచితముగా విభక్తివినిమయము చేయఁబడినది.], నిర్దిష్ట ఆక్రాన్తి మన్దమ్ = పూర్వోక్త మయిన దేశాక్రమణముచేత దుర్బలుఁడును, ప్రతిదిన విరమత్ వీర దాసేర బృన్దమ్=దినదినము రూపఱుచున్న వీరులయు భృత్యులయు సమూహముకలవాఁడును, శశ్వత్ సంశీర్యమాణ ద్విప తురగ వరమ్ =మాటిమాటికి చచ్చుచున్న మంచియేనుఁగులు ఉత్తమాశ్వములును గలవాఁడును, క్షీణ నిశ్శేష సైన్యమ్ = క్షయించిన సకలమయిన సైనికులు గలవాఁడును (అయి),

సాంకృ.—రాజపుత్త్రి, ప్రథమతర మేవ భవత్యాః కథితం మయా, 'కి మప్రతివిధాయ వత్సరాజః స్థాస్య తీ' తి.

సాంకృ.—రాజపుత్త్రీ, ముందే నేను నీతో చెప్పియుంటిని(గదా), 'వత్సరాజు ప్రతీకారము సేయక యుపేక్షించునా?' అని.

వాస.—య ద్యేవం ప్రియం మే ప్రియమ్.

వాస.—ఇట్టుల యేని నాకిది మిగుల ప్రియము.

(ప్రవిశ్య ప్రతీహారీ)

జయతు జయతు భర్తా. ఏష ఖలు విజయసేనో దృఢవర్మకఞ్చుకిసహితో హర్షసముత్ఫుల్లలోచనః ప్రియం నివేదితుకామః ద్వారే తిష్ఠతి.

(ప్రతీహారి ప్రవేశించి)

జయము ఏలినవారికి. వీఁడుగో విజయసేనుఁడు దృఢవర్మకంచుకితోఁ గూడ సంతోషవికసితనేత్రుఁడై ప్రియము చెప్పువాఁడై ద్వారమున నున్నాఁడు.

వాస.—(సస్మితమ్) భగవతి, అహం తర్కయామి పరితోషితాఽ స్మ్యార్యపుత్త్రే ణేతి.

వాస.—(చిఱునవ్వుతో) భగవతి, ఆర్యపుత్త్రుఁడు నన్ను మిక్కిలి సంతోషపెట్టినాఁడని నేను తలంచుచున్నాను.

సాంకృ.—వత్సరాజపక్షపాతినీ ఖల్వహం న కిఞ్చి ద్బ్రవీమి.

సాంకృ.—వత్సరాజుమీఁద పక్షపాతినిని గదా నేను. నే నేమియు చెప్పను.

రాజా.—శీఘ్రం ప్రవేశయ తౌ.

రాజు.—త్వరగా ప్రవేశపెట్టుము వారిని.

అద్య(వా)శ్వః వా మమ బలైః తత్ర దుర్గే విభగ్నే(సతి)=నేఁడో రేపో నాదండులచేత ఆదుర్గము క్షణములో పడఁగొట్టఁబడినది కాఁగా, బద్ధం (వా) యుద్ధే హతం వా = బందిసేయబడినాఁడని (యో) పోర తెగటార్చబడినాఁడని యో, భగవతి త్వం న చిరాత్ శ్రోష్యసి = భగవతీ నీవు త్వరలో వినెదవు. నచిరాత్—సమస్తపదము. విరమత్—రమధాతువు విపూర్వమయిన పరస్మైపది యగును. దాస్యా అపత్యం దాసేరః, దాసేయ శ్చ. సేనాయాం సమవైతి సైనికః సైన్య శ్చ.

---

వాస.—జఇ ఎవ్వం పిఅం మే పిఅం.

ప్రతీ.—ఏసో క్ఖు విఅఅసేణో దిఢవమ్మకంచుఇసహిఓ హరిససముప్ఫుల్లలోఅణో పిఅం ణివేదిదుకామో దువారే చిట్ఠఇ.

వాస.— భఅవది, జహ తక్కేమి పరితోసిదమ్హి అయ్యవుత్తే ణేత్తి.

ప్రతీ.—తథా. [ఇతి నిష్క్రాన్తా.
(తతః ప్రవిశతి విజయసేనః కఞ్చుకీ చ.)

విజ.—భోః కఞ్చుకిన్, అద్య స్వామిపాదాః ద్రష్టవ్యా ఇతి యత్సత్య మనుపమం క మపి సుఖాతిశయ మనుభవామి.

కఞ్చు.— అవితథ మేతత్. పశ్య;

సుఖ నిర్భరో౽న్య థాపి
స్వామిన మవలోక్య భవతి భృత్యజనః;
కిం పున రరి బల విఘటన
నిర్వ్యూఢ ప్రభునియోగభరః ?

ఉభౌ.—(ఉపసృత్య) జయతు స్వామీ. [రాజా ఉభా వపి పరిష్వజతే.

కఞ్చు.—దేవి, దిష్ట్యా వర్ధసే.

హత్వా కళిఙ్గహతకం
నివేశ్యమత్స్వామినం నిజే రాజ్యే,
దేవస్య సమాదేశో
నిర్వ్యూఢో విజయసేనేన.

వాస.—భగవతి, అభిజానా

ప్రతీ.—అట్లే. [అని నిష్క్రమించును.
(అంతట విజయసేనుండును కంచుకియుప్ర.)

విజ.—అయ్యా కంచుకీ, ఇపుడు ఏలినవారిని చూచెదను (గదా) అని అది యేమో సాటి లేని చెప్పలేని సంతోషాతిరేకమును అనుభవించుచున్నాను.

కంచు.—సత్య మిది. కనుము;

వేఱు విధమున నేనియు దొరను చూచి సేవక జనుఁడు పట్టరాని సంతోషమును పొందును, శత్రు సైన్యములను పగులఁగొట్టి యేలికయొక్క ఆనతిబరువును చక్కఁగా మోచిన వాఁడు మఱి (వానిమాట) చెప్ప వలయునా?

ఇరువురు.—జయము ఏలినవారికి.

[రాజు ఇరువుర నుం గవుంగిలించును.

కంచు.–దేవీ, ఆహా నీకు. మేలైనది.

విజయసేనుఁడు పాడుకళింగుని పరిమార్చి నాదొరను ఆయనయొక్క (అంగ) రాజ్యమందు స్థాపించి ఏలినవారి యాజ్ఞను నెఱవేర్చినాఁడు.

వాస.—భగవతీ, ఆనవాలు పట్టితి వా

1. స్వామిపాదాః—పాదశబ్దము (బహువచనాంతము) ఇచట పూజ్యవాచకము, పూజ్యుఁడయినప్రభువు అని యర్థము.

2. నిర్వ్యూఢ—నిర్ - వి - ఊఢ (వహ్ - క్త) = నిర్వహింపఁబడిన, అనఁగా నెఱవేర్పఁబడిన అని భా. * కావ్యార్థాపత్త్యలంకారము.

---

ప్రతీ.—తహా.
వాస.—భఅవది, అహిజాణాసి ఏదం కంచుఇం?

స్యైతం కఞ్చుకినమ్ ?

ఈ కంచుకిని?

సాంకృ.—కథం నాభిజానామి? నను స ఏషః యస్య హస్తే మాతృష్వసా[1] తే పుత్త్రికాయుగం ప్రేషితవతీ.

సాంకృ.—ఆనవాలు పట్టలేమి? ఇతని చేత నిచ్చియే గదా పినతల్లిగారు పుట్టువు నీకు బొమ్మల జతను పంపినది.

రాజా.—సాధు విజయసేన, మహాన్ వ్యాపారో ఽనుష్ఠితః.

రాజు.—బలారే! విజయసేనుఁడా! గొప్ప కార్యము నెఱవేర్చితివి!

[విజ. పాదయోః పతతి.

[విజ. పాదములందు వ్రాలును.

రాజా.—దేవి, దిష్ట్యా వర్ధసే, ప్రతిష్ఠితో రాజ్యే దృఢవర్మా.

రాజు.—దేవి, ఆహా! నీకు మేలు. దృఢవర్మ రాజ్యమందు నెలకొల్పఁబడినాఁడు.

వాస.—(సహర్షమ్) అనుగృహీతాస్మి.

వాస.—(హర్షముతో) అనుగ్రహింపఁబడితిని.

విదూ.—ఈదృశే అభ్యుదయే అస్మిన్ రాజకులే ఏతత్కరణీయమ్; (రాజానం నిర్దిశ్య వీణావాదనం నాటయన్) గురుపూజా, (ఆత్మనో యజ్ఞోపవీతం దర్శయన్) బ్రాహ్మణస్య సత్కారః,[2] (ఆరణ్యకాం సూచయిత్వా) సర్వబన్ధమోక్షః ఇతి.

విదూ.—ఇట్టి గొప్ప మేలునందు ఇట్టి రాజకులమందు ఇవి చేయవలయును; ఎవ్వి యన-(రాజును చూపి వీణావాదనము నభినయించుచు) గురుపూజ, (తన జన్నిదమును చూపుచు) బ్రాహ్మణునికి సత్కారము, (ఆరణ్యకను సూచించి) చెఱలోనివారి నెల్ల విడిపించుటయు.

రాజా.—(వాసవదత్తా మపవార్య ఛోటికాం దదత్) సాధు వయస్య సాధు!

రాజు.—(వాసవదత్తనుండి అపవారించి చిటిక వేయుచు) సరి వయస్యుఁడా సరి!

1. బొమ్మలను పంపుట వాసవదత్త యుజ్జయినిలో నుండఁగా.

2. ఆరణ్యకను సూచించుటకు అభినయ మెట్లో ఊహించుకొనునది.

వాస.—...అణుగహిదమ్హి.

విదూ.—ఈరిసే అబ్భుదఏ అస్సిం రాఅఉలే ఏదం కరణిజ్జం...గురుపూఆ బమ్హణస్స సక్కారో...సవ్వబంధణమొక్ఖో త్తి.

విదూ.—భవతి, కథం త్వ
మత్ర సమాదిశసి?

వాస.—(సాంకృత్యాయనీ మవలోక్య సస్మితమ్) మోచితా హతాశేన ఆరణ్యికా.

సాంకృ.—కిం వా తయా తపస్విన్యా బద్ధయా?

[1] వాస.—యథా భగవత్యై రోచతే.

[2] సాంకృ.—యద్యేవ మహమేవ తాం మోచయామి.

[ఇతి నిష్క్రాన్తా.

కఞ్చు.—ఇద మపరం సందిష్టం మహారాజేన దృఢవర్మణా- 'త్వత్ప్రసాదాత్ సర్వ మేవ యథాభిలషితం సంపన్నమ్, త దేతే ప్రాణా స్త్వదీయాః, యథేష్ట మిమాన్ నియోక్తుం త్వ మేవ ప్రమాణ మి'తి.

[రాజా సలజ్జ మధోముఖ స్తిష్ఠతి.

విజ.—దేవ, న శక్యతే దేవం

విదూ.—అమ్మా, ఈవిషయములో ఏమి యానతిచ్చెదవు?

వాస.—(సాంకృత్యాయనిం గాంచి లేఁతనవ్వు నవ్వుచు) (ఈ) చెడిబ్రదికినవానిచే ఆరణ్యిక విడిపింపఁబడినది.

సాంకృ.—పాపము! దానిని చెఱనుంచిన నేమి ప్రయోజనము?

వాస.—భగవతియిచ్చ యెట్లో అట్లు.

సాంకృ.—అట్లేని నేనె దానిని విడిపించెదను.

[అని నిష్క్రమించును.

కంచు.—ఇట్లును మఱి మహారాజుదృఢవర్మ సందేశించినాఁడు, 'నీదయచేత సర్వమును కోరినట్లు నెఱవేఱినది, కావున ఈ ప్రాణములు నీయవి. నీయిచ్ఛవచ్చినట్లు వీనిని పనిగొన నీవే ప్రమాణమవు.' అని.

[రాజు లజ్జతో మొగము వాంచును.

విజ.—దేవా, ఏలినవారిపై దృఢవర్మ

1. భగవత్యై రోచతే. 'రుచ్యర్థానాం ప్రీయమాణః' అనుటచే చతుర్థి.
2. సాంకృ.—పరివ్రాజిక గావున సత్కార్యముచేయుటకు త్వరపడినది. అది నిష్క్రమణోపాయంబు నయినది.

---

విదూ.—భోది, కహం తుమం ఎత్థ సమాదిససి?
వాస.—...మోఇదా హదాసేణ ఆరణ్ణిఆ.
వాస.—జహ భఅవదీఏ రోఅది.

ప్రతి ప్రీతివిశేషో దృఢవర్మణః కథయితుమ్.

కఞ్చు.—'య ద్యపి తుభ్యం ప్రతిపాదితాయాః ప్రియదర్శికాయా అస్మద్దుహితుః పరిభ్రంశాన్న మే సంబన్ధో జాత ఇతి దుఃఖమాసీత్, తథాపి వాసవదత్తాయాః పరిణేత్రా త దపనీత మే వేతి.

వాస.—(సాస్రమ్) ఆర్య క ఞ్చుకిన్, కథం మే భగినీ పరిభ్రష్టా?

కఞ్చు.—రాజపుత్రి, తస్మిన్ కళిఙ్గహతకావస్కన్దే విద్రుతే ష్వితస్తతోఽన్తఃపురజనేషు, దిష్ట్యా దృష్టా 'మిదానీం న యుక్త మత్ర స్థాతు మి'తి తా మహం గృహీత్వా వత్సరాజాన్తికం ప్రస్థితః. తతః స్నానాయ తాం విన్ధ్యకేతో ర్హస్తే నిక్షిప్య నిర్గతోఽస్మి. యావత్ప్రతీప మాగచ్ఛామి తావ త్తైరపి తత్ స్థానం సహ విన్ధ్యకేతునా స్మర్తవ్యతాం నీతమ్.

కంచు.—'నీకు ఇయ్యఁబడిన ప్రియదర్శిక మా కొమరిత అగపడకపోయినందున నీతో నాకు సంబంధము ఘటిల్లదాయె నని నాకు వంతకలిగియున్నను వాసవదత్తను నీవు పెండ్లియాయినందున అదియును తీఱినదే.' అని.

వాస.—(బాష్పములతో) అయ్యా కంచుకీ, నా చెల్లెలు ఎట్లు అగపడకపోయినది?

కంచు.—రాజపుత్రీ, కళింగహతకుని యాముట్టడిలో అంతిపురిజనులు ఎక్కడికక్కడికో పరారి కాఁగా, నేను పుణ్యవశమున ఆమెను గాంచి 'ఇపు డట నీమె యుండఁదగదు' అని తోడ్కొని వత్సరాజుకడకు తరలితిని. అనంతరము ఆమెను వింధ్యకేతువు చేతిలో నుంచి స్నానముకు వెడలితిని. మరలి వచ్చునంతలో ఎవరో ఆచోటిని వింధ్యకేతునిం గూడ కథామాత్రశేషముగా నొనర్చిరి.

1. భగిని అనఁగా తోడఁబుట్టినది, అక్కగాని చెల్లెలుగాని; ఇందు ఔచిత్యమునుబట్టి చెల్లె లని యర్థము వ్రాయఁబడినది.

వాస.—...అయ్య కంచుఇ, కహం మే భఇణీ పరిబ్భట్టా?

[1] రాజా.—(సస్మితమ్) విజయసేన, కిం కథయసి?

కఞ్చు.—తత్ర చాన్విష్యతా మయా న ప్రాప్తా. తతః ప్రభృతి నాద్యాపి జ్ఞాయతే క్వ వర్తత ఇతి.

(తతః ప్రవిశతి మనోరమా.)

మనో.—భట్టిని, ప్రాణసంశయే వర్తత ఏషా తపస్వినీ.

వాస.—(సాస్రం) కిం త్వం ప్రియదర్శనా వృత్తాన్తం జానాసి?

మనో.—న ఖల్వహం ప్రియదర్శనావృత్తాన్తం జానామి. 'ఏషా ఖల్వారణ్యికా [2] కల్యవ్యపదేశే నానీతం విషం పీత్వా ప్రాణసంశయే వర్తత' ఇత్యేతన్మయా నివేదితమ్. తత్పరిత్రాయతాం భట్టినీ.

[ఇతి రుదతీ పాదయోః పతతి.

వాస.—(స్వగతమ్) హా ధిక్ హా ధిక్ ప్రియదర్శనాదుఃఖమన్తరి

రాజు.—(చిఱునవ్వుతో) విజయసేనా, ఏమి చెప్పెదవు?

కంచు.—అచట వెదకియు (ఆమెను) కానైతిని. అప్పటినుండి యిప్పటికిని తెలియలేదు ఎటనున్నదో అని.

(అంతట మనోరమ ప్రవే.)

మనో.—దేవీ, ఆదీనురాలు ప్రాణసంశయములోనున్నది.

వాస.—(కన్నీళ్లతో) ఏమి నీవు ప్రియదర్శనవార్త నెఱుఁగుదువా?

మనో.—ప్రియదర్శనవార్తను నే నెఱుఁగను. ఇదే యారణ్యిక తేనెమిషచే తేఁబడినవిషమును త్రాగి ప్రాణసందేహములోనున్నదని నేను విన్నవించితిని. కావున కాపవలయును దేవి.

[అని యేడ్చుచు పాదముల వ్రాలును.

వాస.—(స్వగతము) అయ్యయ్యో! ఈ యారణ్యికావృత్తాంతముచేత ప్రియదర్శన

1. ఆ నాశమును చేసినవాఁడవు నీవే గదా అని హెచ్చరిక.

2. కల్యవ్యపదేశేన—'కల్యం ప్రభాతే మధుని సజ్జే దక్షే నిరామయే. కల్యా కల్యాణవాచి స్యాత్.' హైమః. తేనె యని మిషపెట్టుటలో తనకు దుర్భరమైనప్రాణమును పోఁగొట్టున దగుటచే నత్యంతప్రియముగా నున్నదని యభిప్రాయము; ద్రవపదార్థమగుటచేత తేనెమిష పెట్టుట.

---

మనో.—భట్టిణి, పాణసంసఏ వట్టది ఏసా తవస్సిణీ.

వాస.—...కిం ఉణ తుమం పిఅదంసణావుత్తంతం జాణాసి?

మనో.—ణక్ఖు అహం పిఅదంసణావుత్తంతం జాణామి. ఏసా క్ఖు ఆరణ్ణిఆ కల్లవ్వవదేసేణ ఆణీదం విసం పాఇఅ పాణసంసఏ వట్టది త్తి ఏదం మఏ ణివేదిదం. తా పరిత్తాఅదు భట్టిణీ.

త న్మామారణ్యకావృత్తాన్తేన. అతిదుర్జనో లోకః, క దాపి మా మన్యథా సంభావయిష్యతి. త దేత దత్ర యు క్తమ్. (ప్రకాశం ససంభ్రమమ్) మనోరమే, ల ఘ్వీ హై వాసయ తామ్; నాగలోకా ద్గృహీతవిషవైద్య ఆర్యపుత్త్రోఽత్ర కుశలః.

[మనోరమా నిష్క్రాన్తా.

(తతః ప్రవిశతి మనోరమయా ధృతా సవిషవేగ మాత్మానం నాటయ న్త్యార.)

ఆర.—హాలా, మనోరమే, కస్మా న్మా మన్ధకారం ప్రవేశయసి?

మనో.—(సవిషాదమ్) హాధిక్ హాధిక్! దృష్టి దేశేఽ ప్యస్యాః సమాక్రాన్తం విషేణ. (వాసవదత్తాం దృష్ట్వా) భట్టిని, లఘు పరిత్రాయస్వ పరిత్రాయస్వ. గురూభూత మస్యా విషమ్.

వాస.—(ససంభ్రమం రాజానాం హస్తే గృహీత్వా) ఆర్యపుత్త్ర, ఉత్తిష్ఠ లఘు; విపద్యత ఏషా తపస్వినీ.

కో[illegible]నవసటు అంతరించినది. లోకులు అతి దుర్జనులు, ఒకవేళ నన్ను వేఱువిధముగా (తలంచినను) తలంతురు. కనుక ఇది యిందులకు తగినది. (ప్రకాశము, ససంభ్రమము.) మనోరమా, శీఘ్రముగా ఇటకే దానిని తెమ్ము, నాగలోకమునుండి విషవైద్యము నేర్చినవాఁడు ఆర్యపుత్త్రుఁడు ఇందులకు సమర్థుఁడు.

[మనోరమ నిష్క్రమించును.

(అంతట మనోరమచే ఆదుకొనఁబడినదై, విషవేగము అభినయించుచు ఆర ప్ర.)

ఆర.—చెలీ, మనోరమా, ఏల నన్ను చీఁకటిలోనికిఁ గొనిపోయెదవు?

మనో.—(వగచుచు) అయ్యో అయ్యో! దీనికంటికి సయితము విషము ఎక్కినది. (వాసవదత్తను చూచి) దేవీ, త్వరగా కావుము కావుము. మిక్కుటము అయినది దీనివిషము.

వాస.—(తత్తరముతో రాజును చేయి పట్టుకొని) ఆర్యపుత్త్రా, త్వరగా లెమ్ము, పాపము ఇది అడఁగారుచున్నది.

---

వాస.—...హద్ధి! హద్ధి! పిఅదంసణాదుక్ఖ మంతరిదం ఆరణ్ణిఆవుత్తంతేణ. అది దుజ్జణో లోఓ, కదావి మం అణ్ణహా సంభావఇస్సది. తా ఏదం ఎత్థ జుత్తం. ... మణోరమే లహుఅ ఇహ ఎవ్వ అణేహి తం. ణాఅలోఆదో గహీదవిసవెజ్జో అజ్జఉత్తో ఎత్థ కుసలో.

ఆర.—హలా మణోరమే, కీస దాణిం మ అంధఆరం పవేసేసి?

మనో.—...హద్ధి! హద్ధి! దిట్ఠిదేసెవి అక్కందం విసేణ....భట్టిణి లహు పరిత్తాహి పరిత్తాహి. గురుఈభూదం సే విసం.

వాస.—...అయ్యఉత్త, ఉట్ఠేహి లహు. విపజ్జఇ ఏసా తవస్సిణీ.

[సర్వే పశ్యన్తి.

కఞ్చు.—(విలోక్య) సుసదృశీ ఖల్వియం రాజపుత్ర్యాః ప్రియదర్శనాయాః. (వాసవదత్తాం నిర్దిశ్య) రాజపుత్రి, కుత ఇయం కన్యకా?

వాస.—ఆర్య, విన్ధ్యకేతోర్దుహితా. తం వ్యాపాద్య విజయసేనేనానీతా.

కఞ్చు.—కుత స్తస్య దుహితా? సైవేయం రాజపుత్రీ. హా హతోఽస్మి మన్దభాగ్యః! (నిపత్య భూమా వుత్థాయ) రాజపుత్రి, ఇయం సా ప్రియదర్శికా భగినీ తే. విపద్యతే.

వాస.—ఆర్యపుత్ర, పరిత్రాయస్వ పరిత్రాయస్వ! మమ భగినీ విపద్యతే.

రాజా.—సమాశ్వసిహి సమాశ్వసిహి. పశ్యామ స్తావత్. కష్టం భోః కష్టమ్.

సంజాతసాన్ద్రమకరన్దరసాం క్రమేణ
పాతుం గత శ్చ కలికాం కమలస్య భృఙ్గః; [స్రా;
దగ్ధా నిపత్య సహసైవ హిమేన చా

[అందఱు చూతురు.

కంచు.—(చూచి) ఈమె రాజపుత్త్రిని ప్రియదర్శనను కేవలము పోలియున్నదే! (వాసవదత్తను ఉద్దేశించి) రాజపుత్త్రీ, ఎక్కడిది యీకన్యక?

వాస.—అయ్యా, వింధ్యకేతునికూమరిత. అతనిని పొలియించి విజయసేనుఁడు తెచ్చినాఁడు.

కంచు.—అతనికి కూఁతు రెక్కడిది? ఆ రాజపుత్త్రియే యీమె. అయ్యో! చెడితిని రా మందభాగ్యుఁడను! (నేలఁగూలి, లేచి) రాజపుత్త్రీ, ఈమె ఆప్రియదర్శిక, నీచెల్లెలు, అస్తమింపనున్నది.

వాస.—ఆర్యపుత్త్రా, కావు కావు! నాచెల్లెలు అంత మొందుచున్నది.

రాజు.—ఊఱడిల్లుము ఊఱడిల్లుము. ఇదె చూతము. కటకటా! కటకటా!

మకరందరసము క్రమముగా నుప్పతిల్లి నిండుకొనియున్న తామరమొగ్గను త్రాగను తుమ్మెద పోయియుఁ బోకముందే మంచు ఆకస్మికముగాఁ గురిసి ఆమొగ్గను మాడ్చివై

వాస.—అజ్జ విఞ్ఝకేదుణో దుహిదా. తం వావాదిఅ విజఅసేణేణ ఆణీదా.
వాస.—అయ్యఉత్త పరిత్తాహి పరిత్తాహి, మహ భఇణీ విపజ్జఇ.

వామే విధౌ న హి ఫల న్త్యభివా
ఞ్ఛితాని.

మనోరమే, పృచ్ఛ్యతాం తావత్ కిం తే బాధ ఇతి.

మనో.—సఖి, కిం తే బాధః? (సాస్రం పున శ్చాలయన్తీ) సఖి, నను భణామి 'కిం తే బాధ' ఇతి.

ప్రియ.—(అవిస్పష్టమ్) యయా ఏతదవస్థాం గత యాపి మయా న మహారాజో దృష్టః.

[ఇత్యర్ధోక్తే భూమౌ పతతి.

రాజా.—

ఏషా మీలయతీద మీక్షణ
యుగం, జాతా మమాన్ధా దిశః;
కణ్ఠో௨స్యాః ప్రతిరుధ్యతే, మ

చినది; విధి నిరుద్ధముగా నున్నప్పుడు కోరికలు ఈడేఱవు సుమా.

మనోరమా, అడిగి చూడుము 'నీకేమని తెలియుచున్నదో?' అని.

మనో.—సఖీ, నీకేమని తెలియుచున్నదో? (కన్నీళ్లతో మాఱుల కదలించుచు) సఖీ, అడుగుచున్నాను గదా 'నీకేమని తెలియుచున్నదో?' అని.

ప్రియ.—(అస్పష్టముగా) ఈయవస్థకు వచ్చిన దాన నయినను నాచే మహారాజు కనఁబడకున్నాఁడు.

[అని సగముమాటుంగానే నేలఁ గూలును.

రాజా.—

ఈ చెలికి కనుఁగవ మూఁతపడుచున్నది, నాకు దిక్కులు చీఁకట్లు అయినవి; ఈ చెలికి గొంతు అడుచుకొనుచున్నది,

భృఙ్గః క్రమేణ సంజాత సాన్ద్ర మకరన్ద రసాం కమలస్య కలికాం పాతుం గతః చ = తేఁటి క్రమక్రమముగా నుప్పతిల్లిన నిండు తేనియ ద్రవముతోడి తామరమొగ్గను త్రాగను పోనుం బోయినది, అసౌ హిమేన సహసా నిపత్య దగ్ధా ఏవ చ = ఆ మొగ్గను మంచు ఆకస్మికముగా గురిసి మాడ్చి వైవను వైచినది. రెండువాక్యములలోని రెండు చకారములును గమనదహనములకు నడుమ విలంబము లేమిని తెలుపుచున్నవి.

క్రమక్రమముగా సర్వాంగసౌష్ఠవము సంపూర్ణమై అత్యంతము వరభోగ్యతను బొందియున్న యీ బాలను (ప్రియదర్శికను) అనుభవించుటకు నేను (వత్సరాజు) తమకపడుచున్న సమయమందే ఈయాకస్మికవిషపానము సంభవించి యీ చెలువను ప్రాణాంతమునకుఁ దెచ్చినది. విధి నాకు వైరి యై యుండ నాకోరిక యేల యీడేఱును!—అని రాజు తలపోయుట ప్రస్తుతార్థము. * అప్రస్తుతప్రశంసాలంకారము. మూఁడుపాదములు* విశేషంబును నాలవదాన సామాన్యంబును నిబద్ధంబులుగాన, * అర్థాంతరన్యాసము.

---

మనో.—సహి, కిం తే బాహాఓ?...సహి ణం భణామి కిం తే బాహాత్తి.
ప్రియ.—...,జం ఏదం అవత్థం గదాఏ వి మఏ ణ మహారాఓ దిట్ఠో.

మ గిరో నిర్యాన్తి కృచ్ఛ్రాదిమాః;
ఏతస్యాః శ్వసితం హృతం, మమ
తను ర్నిశ్చేష్టతా మాంగతా ;
మన్యేఽస్యా విషవేగ ఏవ హి
పరం సర్వం తు దుఃఖం మయి.

నాకు ఇవే మాటలు కష్టముగా వెలువడు చున్నవి; ఈ చెలికి ఊర్పు నిలిచిపోయినది, నా దేహము చేష్ట ఉడిగినది; ఈ చెలికి విషమెక్కుట మాత్రమే అనియు, దుఃఖ మంతయు నాకే అనియు, తలంచు చున్నాను.

వాస—(సాస్రమ్) ప్రియదర్శనే, ఉత్తిష్ఠ; ఏష మహారాజ స్తిష్ఠతి. కి మిదానీం మయా అజానన్త్యాప రాద్ధం, యేన కుపితా మాం నాల పసి? త త్ప్రసీద ప్రసీద, న ఖలు పున ర ప్యపరాత్స్యామి. హా! దైవ హతక ! కి మిదానీం మ యాపకృ తం యె నై తా మవస్థాం గతా మె భగినీ దర్శితా? [ప్రియ. యా ఉపరి పతతి.

వాస.—(కన్నీళ్లతో) ప్రియదర్శనా లేవే; ఈతఁడే మహారాజు నీయెదుట ను న్నాఁడు నేను తెలియక యేమి తప్పుచేసి తినే ఇట్లుకోపగించి నాతో పలుకవు? మ న్నింపుము మన్నింపు ఇఁకను తప్పుచేయను జుమా.(మీఁదు చూచి) హా పాడుదైవమా! నేనిపుడే తప్పుచేసితిని, నా చెల్లెలిని ఈ యవస్థకు తెచ్చిచూపించితిని? [ప్రియదర్శికమీఁద పడును.

ఏషా ఇదమ్ ఈక్షణయుగం మీలయతి-ఈమె యీకనుదోయిని మూయుచున్నది, మమ దిశః అన్ధా జాతాః = నాకు దిక్కులు గ్రుడ్డివి (అగపడనివి) అయినవి ; అస్యాః కణ్ఠః ప్రతిరుధ్యతే=ఈమెయొక్క గొంతు అడ్డగింపఁబడుచున్నది, మమ ఇమా గిరః కృచ్ఛ్రాత్ నిర్యాన్తి = నాయొక్క యీమాటలు కష్టముతో వెలువడుచున్నవి; ఏత స్యాః శ్వసితం హృతమ్=ఈమెయొక్క శ్వాసము బద్ధమైనది, మమ తనుః నిశ్చేష్టతామ్ ఆగతా=నాదేహము నిర్వ్యాపారత్వమును పొందినది; అస్యాః పరం విషవేగః ఏవ హి ఇతి=ఈమెకు అయినదో విషవ్యాప్తి మాత్రమే (అనియు), సర్వం దుఃఖం తు మయి (ఇతి)=సమస్తమయిన దుఃఖ మయినదో నాకు (అనియును), మన్యే=తలంచు చున్నాను. మీలనాదికారణములు ఒకరియందును అంధతాదికార్యములు మఱి యొకరియందును జెప్పఁబడినవి గావున, *అసంగత్యలంకారము, 'విరుద్ధం భిన్న దేశత్వం కార్యహేత్వో రసంగతిః.'

వాస.—...పిఅదంసణే ఉట్ఠేహి. ఏసో మహారాఓ చిట్ఠఇ. కిం దాణిం మఏ అవరద్ధం అఆణంతీఏ, జేణ కుపిదా మం ణాలవసి? తా పసీద పసీద. ణ క్ఖు పుణో వి అ వరజ్ఝిస్సం...హా దెవ్వహదఅ! కిం దాణిం మఏ అవకిదం జేణ ఏదం అవత్థం గదా మే భఇణీ దంసిదా?...

విదూ.—భో వయస్య, కథం త్వం మూఢ ఇవ తిష్ఠసి? నైష విషాదస్య కాలః. విషమా ఖలు గతి ర్విషస్య; తద్దర్శయ ఆత్మనో విద్యాప్రభావమ్.

విదూ.—వయస్యుఁడా, ఏమి నీవు మూర్ఛపొందినవాఁడుగా (ఊరక) ఉన్నావు? ఇది దిగులునకు కాలము గాదు. విషముయొక్క గతి కుటిలము గదా; కనుక చూపుము నీవిద్యాప్రభావమును.

రాజా.—సత్య మేతత్. (ప్రియదర్శికా మవలోక్య) మూఢ ఏవాహ మేతావతీం వేళామ్;తదహ మేనాం జీవయామి. సలిలం సలిలమ్.

రాజు.—నిజమే యిది. (ప్రియదర్శికను జూచి) మూఢుఁడనే(అయితిని) ఇంతసేపు; మఱియీబాలను బ్రదికించెదను. నీళ్లు నీళ్లు.

విదూ.—(నిష్క్రమ్య పునః ప్రవిశ్య) ఏత త్సలిలమ్.

విదూ.—(వెలికేఁగి మఱల వచ్చి) ఇవిగో నీళ్లు.

[రాజా. ఉపస్పృశ్య ప్రియదర్శికాయా ఉపరి హస్తం నిధాయ మన్త్రస్మరణం నాటయతి. ప్రియదర్శికా శనై రుత్తిష్ఠతి

[రాజు ఆచమనము చేసి ప్రియదర్శికపై చేయి యుంచి మంత్రస్మరణము నభినయించును. ప్రియదర్శిక క్రమక్రమముగా లేచును.

వాస.—దిష్ట్యా! ప్రత్యుజ్జీవితా మే భగినీ!

వాస.—ఏమి నాపుణ్యము! నా చెల్లెలు బ్రదికింపఁబడినది.

విజ.—అహో! దేవస్య విద్యాప్రభావః!

విదూ.—అహాహా! ఏలినవారివిద్యాప్రభావము!

కఞ్చు.—అహో! సర్వత్రాప్రతిహతా నరేన్ద్రతా[1] దేవస్య!

కంచు.—అహాహా! దేవరవారి నరేంద్రత అంతటను అడ్డులేనిదిగా నున్నది!

1. నరేన్ద్రతా—నరపతిత్వము, విషవైద్యత్వము, అని రెండర్థములు.

---

విదూ.—భో వఅస్స, కహం తుమం మూఢో ఎవ్వ చిట్ఠసి? ణ ఏసో విసాదస్స కాలో. విసమా క్ఖు గఈ విసస్స. తా దంసేహి అప్పణో విజ్జాప్పహావం.

విదూ.—...ఏదం సలిలం.

వాస.—దిట్ఠిఆ పచ్చుజ్జీవిఆ మే భఇణీ.

ప్రియ.—(ఉత్థా యోపవిశ్య జృమ్భికాం నాటయన్తీ అవిస్పష్టమ్) మనోరమే, చిరం ఖలు ప్రసుప్తాస్మి.

విదూ.—భో వయస్య, నిరూఢం తే మన్త్రవాదిత్వమ్.

[ప్రియా. సాభిలాషం రాజానం నిరూప్య సలజ్జం కిఞ్చి దధోముఖీ తిష్ఠతి.

వాస.—ఆర్యపుత్త్ర, కి మిదానీ మ ప్యేషా అన్య థైవ కరోతి ?

రాజా.—(సస్మితమ్)

స్వాభావస్థా దృష్టి
ర్న భవతి, గిరో నా తివిశదాః,
తనుః సీద త్యేషా
ప్రకట పులక స్వేద కణికా,
యథా చాయం కమ్పః
స్తన భర పరిక్లేశ జనన;
స్తథా నాద్యాఽ ప్యస్యా
నియత మఖిలం శామ్యతి విషమ్.

కఞ్చు.—(ప్రియదర్శికాం నిర్దిశ్య) రాజపుత్త్రి, ఏష తే పితు రాజ్ఞాకరః ప్రణమతి.

[ఇతి పాదయోః పతతి.

1. అనుమానాలంకారము.

ప్రియ.—(లేచి కూర్చుండి ఆవులింత నభినయించుచు అస్పష్టముగా) మనోరమా, చాలసేపు నిద్రించితిని.

విదూ.—వయస్యా, నీమంత్రవాదిత్వము రూఢికెక్కినది.

[ప్రియ. ఆసతో రాజుం గాంచుచు లజ్జతో కొంచెము మొగము వాంచును.

వాస.—ఆర్యపుత్త్రా, ఏమి ఇది యింకను వేఱు తీరుగానే యున్నది?

రాజు.—(లేత నవ్వుతో)

చూపు ప్రకృతికి రా లేదు, మాటలు అంతగా స్పష్టములు గావు, ఈ మేను ముమ్మరముగా గగుర్పాటును చెమట బొట్లును గలదై సోలుచున్నది. మఱియు ఈ కంపము నిండు పాలిండ్లకు శ్రమపెట్టునదియై యున్నది; ఇవి యెల్లం జూడ ఇప్పటికి నిశ్చయముగా ఈమెకు విషము అంతయు విఱుగ లేదు.

కంచు.—(పియదర్శిక నుద్దేశించి) రాజపుత్త్రి, వీఁడె నీ తండ్రియొక్క కింకరుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

[అని పాదములం ద్రెళ్లును.

ప్రియ.—...మణోరమే, చిరం క్ఖు పసుత్తమ్హి.
విదూ.—భో వఅస్స నిరూఢం దే మంతవాదిత్తణం.
వాస.—అయ్యఉత్త, కిం దాణిం క ఏసా అణ్ణహా ఎవ్వ కరేది?

ప్రియ — (విలోక్య) కథం క ఞ్చుకీ ఆర్యవినయవసుః! (సాస్రమ్) హా తాత, హా అజ్జుకే!

కఞ్చు — అలం రుదితేన కుశ లినౌ తే పితరౌ వత్సరాజప్రభా వాత్. పున స్తదవస్థ మేవ రా జ్యమ్.

వాస.—(సాస్రమ్) ఏహి అలీక శీలే, ఇదానీ మపి తావత్ భగిని కాస్నేహం దర్శయ. (కణ్ఠే గృహీత్వా) ఇదానీం సమాశ్వస్తాస్మి.

విదూ.—భవతి, త్వాం భగి నీం కణ్ఠే గృహీత్వా ఏవం పరితు ష్టాసి. వైద్యస్య పారితోషికం విస్మృతమ్.

వాస.—వసన్తక, న విస్మృ తమ్ (రాజానం నిర్దిశ్య సస్మితమ్) వై ద్య, ప్రసారయ హస్తమ్, భగిన్యా అగ్రహస్తం తే పారితోషికం దాప యిష్యామి.

ప్రియ.—(చూచి) ఏమి! కంచుకి ఆర్యవినయవసువా! (కన్నీళ్లతో) అయ్యో నాయనా, అయ్యో అమ్మా!

కంచు.—ఏడువకు వత్సరాజప్రభావముచే నీ తలిదండ్రులు క్షేమముగా నున్నారు. రాజ్యము వెండియు మునుపటి యట్లె యున్నది.

వాస.—(కన్నీళ్లతో) రావే మాయలాడీ, ఇప్పుడేనియు చెల్లెలిచెలిమిం జూపవే. (కంఠమునం గవుంగిలించి) ఇప్పుడు ఊరడిల్లితిని.

విదూ.—అమ్మా నీవు చెల్లెలిని మెడలోఁ గవుఁగిలించుకొని యిట్లు పరమానందంబున నున్నావు. వైద్యునికి బహుమానము మఱచితివి.

వాస.—వసంతకా, మఱవలేదు. (రాజా నుద్దేశించి, మందహాసముతో) వైద్యుండా, చేయిచాఁపుము, నా చెల్లెలిచేతిని నీకు బహుమాన మిప్పించెదను.

---

ప్రియ.—...కహం కంచుఈ అయ్య విణయవసూ! ... హాతాద! హాఅజ్జుఏ!
వాస.—...ఏహ్యి అలీఅసీలే; దాణిం వి దావ భఇణిఆసిణేహం దంసేహి. ...దాణిం సమస్సత్థమ్హి.
విదూ.—హోది, తుమం భఇణిం గణ్హిఅ కంఠే ఎవ్వం పరితుట్ఠాసి; వెజ్జస్స పారితోసిఅం విసుమరిదం.
వాస.—వసంతఅ ణ విసుమరిదం. ... వెజ్జ, పసారేహి హత్థం. భఇణీఏ అగ్గ హత్థం దే పారితోసిఅం దావఇస్సం.

[రాజా హస్తం ప్రసారయతి ; వాస. ప్రియదర్శికాహస్త మర్పయతి.

రాజా.—(హస్తం పరిహృత్య) కి మనయా? సంప్ర త్యేవ కథ మపి ప్రసాది తాసి.

వాస.—క స్త్వ మనుగ్రహీతుమ్? ప్రథమ మేవ తాతే నేయం దత్తా.

విదూ.—భో మాననీయా ఖలు దేవీ; మాస్యాః ప్రతికూలం కురు.

[వాస. రాజ్ఞో హస్తం బలా దాకృష్య ప్రియదర్శికా మర్పయతి.

రాజా.—దేవీ ప్రభవతి. కుతో ఽన్యథాకర్తుం విభవః?

వాస.—ఆర్యపుత్ర, అతోఽపి పరం కిం క్రియతామ్?

రాజా.—కి మతః పరం ప్రియమ్? పశ్య—

నిశ్శేషం దృఢవర్మణా పునరపి స్వం రాజ్య¹ మధ్యాసితం;
త్వం కోపేన సుదూర మ ప్యపహృతా సద్యః ప్రసన్నా మమ;

[రాజు చేయి చాఁచును; వాస. ప్రియదర్శికాహస్తమును అర్పించును.

రాజు.—(చేతిని విసర్జించి) ఏల యీ కన్య? ఇప్పుడే యెట్టకేలకు ప్రసన్నురాల వైతివి.

వాస.—నీ వెవఁడవు కైకొనుటకు? ముందుగానే నాయన దీనిని ఇచ్చెను.

విదూ.—ఓయి, మాననీయురాలు గదా దేవి, ఆమెకు ప్రతికూలము సేయకుము.

[రాజుచేతిని బలాత్కారముగా తివిచి ప్రియదర్శిక నిచ్చును.

రాజు.—దేవి యేలుచున్నది. దేవి చిత్తమును దాఁటుట కేటిసామర్థ్యము?

వాస.—ఆర్యపుత్త్రుఁడా, ఇంకను ఏమి ప్రియము చేయవలయును.

రాజు.—ఇంతకు పయిగా ప్రియము ఉండునా? చూడు—

దృఢవర్మ యెండియు తనరాజ్యమం దెల్ల నెలకొన్నాఁడు, నీవు కోపముచే బహుదూరము అపహరింపఁబడియు వెంటనే నా యందు ప్రసన్నురాలవయితివి. నీచెల్లెలు

1. అధ్యాసితమ్.—ఆస్ అకర్మకము, అధిపూర్వకమయినప్పుడు సకర్మకము గును, ఆధారము కర్మయగును.

---

వాస.—కో తుమం అణుగ్గిహిదుం? పుఢమం ఎవ్వ తాదేణ ఇయం దిణ్ణా.
విదూ.—భో మాణణీఆ క్ఖు దేవీ. మా సే పడిఊలం కరేహి.
వాస.—అయ్యఉత్త, అదో వి పరం కిం పిఅం కరీఅదు.

జీవన్తీ ప్రియదర్శికా చ భగినీ భూయ స్త్వయా సఙ్గతా;
కి న్న్వ స్మా దపరం ప్రియం ప్రియతమే య త్సాంప్రతం ప్రార్థ్యతే.?

ప్రియదర్శికయు ప్రాణములు దక్కి- చెల్లెలయి నిన్నుఁ గలసినది; ఓ ప్రియతమా నే నిపుడు ప్రార్థించుటకు ఇంక వేఱుప్రియ మేమి యుండును.

² త థా పీద మస్తు.

అయిన నిది యగుఁగాక.

(భరతవాక్యమ్.)

ఉర్వీ ముద్దామసస్యాం జనయ
తు విసృజన్ వాసవో వృష్టి మిష్టా,
మిష్టై స్త్రైవిష్టపానాం విదధతు
విధివత్ ప్రీణనం విప్రముఖ్యాః,
ఆకల్పాన్త ఞ్చ భూయాత్ స్థి
రతర ముచితా సఙ్గతి స్సజ్జనానాం,
నిశ్శేషం యాన్తు శా న్తిం పిశు
నజనగిరో దుర్జయా వజ్రలేపాః.

[ఇతి నిష్క్రాన్తాః సర్వే

(భరతవాక్యము.)

కోరినవర్షము గురియుచు ఇంద్రుఁడు భూమిలో మిక్కుటముగా సస్యము పండించును గాక, బ్రాహ్మణశ్రేష్ఠులు యజ్ఞములచే యథావిధిగా దేవతలకు ప్రీతి యొనర్తురుగాక, తగిన సజ్జనసాంగత్యము కల్పముతుదివఱకును మిక్కిలి దృఢ మగుఁగాక, జయింపరాని వజ్రలేపములయిన కొండెగాండ్ర వాక్కులు సంపూర్ణముగా శమించును గాక.

[అని అందఱును నిష్క్రమింతురు.

ఇతి చతుర్థోఽఙ్కః.

---

ఇతి శ్రీమహాకవి శ్రీహర్షవిరచితా
ప్రియదర్శికా నాటికా సమాప్తా.

---

2. భరతవాక్యమ్—భరతుఁడు (అనఁగా నటుఁడు) చెప్పునట్టి వాక్యము.

3. త్రైవిష్టపానామ్—త్రివిష్టప మనఁగా స్వర్గము-అందు ఉండువారు త్రైవిష్టపులు. ఆకల్పాన్తమ్=ప్రళయమువరకు-ఆ=వఱకు - కల్ప మనఁగా బ్రహ్మయొక్క పగలు-కల్పాన్తః=ప్రళయము. వజ్రలేప మనఁగా పగిలినరాలను అంటించుటకు సిద్ధముచేయఁబడు నొకజిగురు; దానితో అదుకఁబడినది మఱి వీడదు, అట్లే కొండెగాండ్ర మాటలను ప్రభువులు నమ్ముదురు, ఆమాటలయందలి మోసమును వారి కెఱుకపఱుచుటకు ఎవరికిని శక్యముగాదు; అట్టియాకొండెములు నశించును గాక యని ప్రార్థన.

10. తే. తలఁగి ఘనబంధనంబును దీఱి మునుపటి
కన్నెను గ్రహించి సముచితులం జిన్ను మీఁది
ఆత్మధామంబు వెండియు నధిగమించి
తేజరిల్లెడుఁ గదు వత్సరాజుపగిది.

12. ఉ. సేవకభక్తియుక్ సచివసింహుల ప్రజ్ఞయుఁ బల్లె మిత్ర్యు, మి
త్రావళి తేట యయ్యె, పతితం బధికంబు ప్రశంసనీయమున్,
నేఁత మాజిసాహసిత, దేవడిగముల్ దగుశీలలాఘు; నా
కేపిభవంబు నీసిగశ్ ముయ్య దగాంశ్లోకధర్మకల్పనా !

14. సీ. చిమ్మచీఁకటి గ్రమ్ము చెఱను జొప్పదు గాని
యాముఖేందుజ్యోత్స్న నరయ నేమి?
సంకెలరవళికిఁ గింకఁ జెందెదు గాని
యామధురాలాప మరయ నేమి ?
కూళలఁ జెఱరక్షకులఁ దలంతువు గాని
యానెయ్యపుఁ గటాక్ష మరయ నేమి?
* స్వాతంత్ర్య మెడపినసటల నెంచెదు గాని
యాచెలిసంగాత మరయ నేమి?
తే. దోసములె? బంధనంబున వాసి లేదె ?
మనమునను జక్కఁ దలపోయుమా మనుష్య,
ఏమి చండమహాసేనభూమివిభుని
పుత్త్రికామణిగుణగణంబునకు సాటి ?

15. తే. అప్పుడే వెల్వడినవార లయ్యు వెండి
యవనినాథుని మోలకు నరుగువేళ
దప్పు లేకయె భృత్యులు తలఁచుగాఁగఁ
ద ప్పొనర్చినచందానఁ దల్లడింత్రు.

18. చ. తొలుతను బొమ్ము పోటులను దు మ్మొనరించి పదాతులన్, శరా
వళు లడరించి త్రెళ్లవలె వాజుల దిక్కు మొగంబు సేసి, యా
వలఁ బెఱకైదువు ల్విసరివైచి మహాసిని దూసి యేన్గులన్
సెలగఁ దోడంగె నంటిపనిఁ జిందఱవందఱ సేయునాటగాన్.

19. తే. ఒక్కఁడె బలత్రయము నిట్టు లుక్కడించి
కత్తినెత్తుట నెగుమూఁపు జొత్తిలంగ

తోఁడిమలనుండి జాతి పడి తోట్టిసమింకెసప్రూన్పులకాన్పులకున్
బుడమి మహేంద్రగోపశతపుష్టి నిమూయసనోష్ట నిష్పాడుకున్. ౧౭.

33. క. వీనులకు విం దొనర్చుఁ బ్రి
యానూపురరావహారు లగునంచరోదల్;
ఆనంద మిడుఁ గనులకుఁ ద
టానోకహవివరదృశ్య లగువీచితతుల్. ౧౮.

,, క. గమ్మన వలచెడుతామర
సమ్ములనెత్తావి ఘ్రాణసమ్మద మునఁగున్;
అమ్మయశీతమ్ములు వా
తమ్ములు గాత్రమ్ములకు ముద మ్మొదవించున్. ౧౯.

34. తే. చూచినంతనె యెంతయుఁ జోద్యముగను
స్వచ్ఛమును విస్ఫుటాంభోరుహచ్ఛవియును
బ్రమదవనలక్ష్మిదీర్ఘనేత్రం బనంగ
డిగ్గియ ముదం బొసంగు నాడెందమునకు. ౨౦.

35. చ. బలియిలు వీడి భూమిఁ గనఁ బన్నగకన్యక యేఁగు వెంచనో!
కలుగదు దాన నిట్టిచెలి, కంటిని నే నలలోకమున్ వృథా;
నెలవెలుఁ గిట్లు రూపు గొని నిల్చెనో? యుండఁ ద వెంచునుం బవల్;
నలినముఁ గేలఁ దాల్చి సిరి నాఁ దగునీలలితాంగి యెవ్వతో? ౨౧.

39. మ. అమృతాసారిణినాఁగ గన్నులకు నాహ్లాదంబు గావించుచున్,
సమయంబందుఁ బయోధరాంశుకము స్రస్తం బౌట దృక్పుణ్యమై,
హిమధామాకృతి యైనయీరమణిచే హేలాగృహీతంబు లీ
కమలంబు ల్మకుళింపకున్నవి! యదే కన్పట్టుఁ జోద్యంబు గాన్. ౨౨.

41. తే. విసువకుము గోల యీ తేంట్లు ముసురుకొనియెఁ
దావికై నీదునెమ్మోముఁదమ్మిమీఁద;
వెండి వెదచల్లెదేని నీబెదరుఁజూపుఁ
గలువతంపరసిరి నవి తలఁగునెట్లు! ౨3.

45. తే. నోరు మూసికొనియును నీసొగసవని
కంటకంబులఁ దాల్చినకారణమున
భామినీమణిమృదుపాణిపల్లవంపు
స్పర్శసమ్మోదమును దేటపఱుచుఁ జూవె. ౨౪.

47. చ. కమలవనంపుశోభఁ గాని కాంతివలెన్ దినలక్ష్మి యేఁగె, రా
గము గపిమండలిన్ ఘనముగాఁ గన నయ్యెడి నాయెదన్ బలెన్,
కమలినిపంత నావలెనె కాంతఁ దలంచుచుఁ గోక ముండెడిన్,
సమకొనె నాకుఁ బోలె దివసంబున కంతట నంధకారముల్. ౨౫.

55. క. ఊరుపునెపమున నెలువడు
వాగక రేఁబవలు నీవు వలవంత చెలీ,
ధారాళముగాఁ బడు మరు
నారసముల ఝంక్రియానినాదమొ యనఁగాన్. ౨౬.

62. క. ఎదియును దా నసదయ్యును
నొదవినమహదాశ్రయమున నొందును మహిమన్;
మదగజకుంభస్థం బై
పొదలదె బూడిదయుఁ బొగసి భూషణపదవిన్? ౨౭.

64. తే. వలుదపు త్రెంపుఁ గలువడంబులను దాల్చి
గతనపుంబ్రేఁడికంబముల్ రాజిలంగ,
అచ్చగల మించుజవ్వను లధివసింప,
సుగవిమానంబుగతి నొప్పుఁ జూపుటిల్లు. ౨౮.

66. తే. భవ్యత నొనర్తు సంతతపురస్యవస్థఁ,
గనుఁడుఁ బ్రతిపదమునను సంస్ఖలితములను,
దండనీతిని జక్కఁగాఁ దాల్చి నడుతు,
మునసెనె సృపవృత్తి మొల్లను ముదిమి నాకు. ౨౯.

67. ఉ. అందెలు కాళ్ల, శింజితసమంచితకాంచిక శ్రోణిమండలిన్,
సందిట బాజిబందులుఁ, గుచస్థలి బన్న సరంబులున్, శిరం
బందును నాగగంబుఁ, జెవులందును గమ్మలునున్ జ్వలించెడున్
గ్రందుగ రాణిగాగ్ల యుడిగంపుఁ దుటారి మిటారి పాళికిన్. ౩౦.

71. ఉ. ఇప్పుడె పూర్వరీతిఁ దపియించుట మానె సమన్ సుధాకరుం,
డిప్పుడె మానె మారి నలయించుటు మున్వలె వేఁడియూరుపుల్,
ఇప్పుడె రిత్త గాదు మది, యుస్తె యమందము లయ్యె నంగముల్!
తప్పను గుందు కోరికల ధ్యానముసేసెడుమాత్ర నైనను. ౩౧.

74. తే. పరిజనాన్వితుఁ బ్రద్యోతు వైరఁగుపఱిచి,
వీణ వాయించుచును మహాపిఠముమునఁ,

సంధ్యను డించినన్ జెలియుఁ బక్షకంపముచేత నూరుఫల్ ;
అన్యుని ! శైత్యప్రసాద మిది యక్షుని నీరజ దాఁగురింపఁగాన్ ! ౪౧.

91. ఉ. ఏల కళంకిఁ జేసెదు ముఖేందునిఁ గన్బొమల న్మరుంచుచున్ ?
గాలికి నాసుమం తనవగన్ బొరయించెదు మోవి నేలొకో ?
సోలెదఁ గా నుగోజన్పతి, ప్రుక్కఁగఁ జేసెద వేల యింకనున్ ?
శీలన మా క్రియన్ నిను నగింపనె చేసితి; మాను కోపమున్. ౪౨.

93. ఉ. ఒక్కటి భ్రూవిటీషణము నొక్కటుసుగ్మకణంబుఁ జందమున్,
దన్ని భగ్నానిలంబుఁ జకితప్లవమానమృగీవిలోకమున్ ,
దక్కిన దేహమాను దయితాముఖపద్మము బ్రోలఁ గాంచుచున్
జిక్కితి భీతిచే నలఘుచేతను నే నురుసంకటంబునన్. ౪౩.

101. ఉ. నిట్టపినాన నవ్వుదు నదీనతఁ గంఠముఁ గౌఁగిలింతునా ?
యా క్లిష్ట బలుప్రసంగమున హర్షము నొందఁగఁ జేసికొందునా ?
నెట్టన కేలు సాచ్చి నగనీరరుహంబులఁ ద్రెళ్లి యుందునా ?
గుట్టులు జేసియూ నవనయించఁగ నోనో యెఱుంగ మిత్రమా. ౪౪.

102. ఉ. ఏల దోలంగ నాసనము నీక్రియ నాకయి? యిట్లు తొట్రుపా
టేలొకో ? తీవఁగావలయునే ననుఁ గూరిచి కాంతమధ్యరో ?
లోలకటాక్షపుంగ్వనని లోనగునాసుని నన్ బ్రపన్ను నీ
వేల మనోదగర్భము రచియించి విలక్షునిఁ జేసి దిస్మయిన్ ? ౪౫.

103. చ. మురిసినవు గాని కన్బొమల, ముస్తవిలోచన యెత్తు మాటికిన్;
వదలను నామిపడం దడంతు, శ్వాసము నూర్చియు దీర్ఘదీర్ఘమున్;
నుడివెదు గాని, నిల్చెదు మనోగతి దేనినొ చింతసేయుచున్;
అడఁచిన నీదుకిన్క నిర్వృతాహతి దైనడి నన్ను నొంచెడిన్. ౪౬.

105. ఉ. ముట్టడి కల్కినట్టి గజబ్రాంల సుభృత్యులు నాఁడునాఁటికిన్
గిట్టి, గజాశ్వము ద్రుడియ, ఖిన్నను గాఁగ సమస్తసైన్యముల్,
పట్టి పదాతులన్నయము నపాటము సేసి, కళింగుఁ బాదలిన్
గట్టిగఁ గొట్టగన్ యొకటిగా నిపానహస్తుగా నేఁడొ యుల్లిగో. ౪౭.

,, తే. విజయసేనుని మును మనవిజయసేన
బయటికి జెశంబు పట్టఁగాఁ బ్రభవ మోఁది
దుర్గముఁ గళింకహతరాజ్యు దూరి యందుఁ
గోట గోడను శకలాగాఁ గొమసుచుండె.

107. క. ఒండువగనేని దొరఁ గను
పండువు సేసికొనుభటుఁడు ప్రమదజడుఁ డగున్,
దండిపగఱ దొరయానతిఁ
జెండిన వీరవరుమాట చెప్పవలయునే!

క. పాలియించి హతకళింగుని,। నెలకొల్పి మదీయపిభుని నిజరాజ్యములోఁ,
నిలలోన విజయసేనుఁడు। నిలిపెన్ వీరాగ్రగుండు నీశాసనమున్. ౫౦

113. తే. క్రమముగాఁ దేనె నిండఁగఁ బ్రమదమూఁగఁ
బోయెఁ దేఁటియుఁ దామరమొగ్గఁ గ్రోల,
మంచునుం బడి దానిని మాడ్చి వైచె,
విధి విరోధింపఁ గోర్కు లెవ్విధి ఫలించు!

114. చ. కలికికిఁ గన్నుమూఁతపడెఁ గ్రమ్మెను జీఁకటి నాకు దిక్కులన్;
నిలిచెను శ్వాస మింతికి, వినిగ్గతచేష్టిత మయ్యె నాయొడల్;
ఎలుఁగు నిరుద్ధమయ్యెఁ జెలి, కింకెను నానుడి న్యాయసూక్తిన్;
దలఁప విసంబె బాలకు వెత ల్సకలంబులు నాకె పాటిలెన్. ౫౧

117. ఆ. చూపు సరిగ లేదు; స్ఫుటత చాలదు మాటఁ;
దనువు డయ్యె, గగురుకొనుఁ, జెమర్చు;
చన్నుఁగవను వణఁకు సంధించుఁ గ్లేశంబు;
కాన నబల కింకఁ గలదు విషము. ౫౨

119. ఉ. మానితరీతిఁ బొందె నిజమండలమున్ ధృఢవర్మ వెండియున్;
బూనినకిన్క నీవు విడి పొందితి విప్పుడె నాపయిన్ గృపన్;
ప్రాణము దక్కి నిన్నుఁ జెలియల్ ప్రియదర్శిక గాంచె; నింకనున్
దేనిని వేఁడఁగా వలయుఁ దెల్పఁగదే మఱి జీవితేశ్వరీ. ౫౩

120. ఉ. వాసవుఁ డిష్టవృష్టుల నవారిగఁ బాఁడియుఁ బంటఁ బెంచుతన్;
భూసురలిష్టులన్ సురసమూహములం దనిపింత్రు గావుతన్;
వాసిగ సాధుసంగమము వర్ధిలుఁ గావుత శాశ్వతంబుగా;
నాసిలుఁ గావుతన్ ఖలుల నాల్కలు సాటెఁదుకొఁడుకొందెమున్. ౫౪

